


రామ్ మరియు శ్యామ్
అమ్యూజ్‌మెంట్ పార్క్‌లో ఉంటారు.







చూస్తుండగానే ఆ అరుపులు
మరింత తీవ్రమవుతాయి




క్యారేజ్‌గాలిలోకి ఎగురుతుంది
అందరు భయాందోళనలో మునిగిపోతారు.






ఇద్దరు పిల్లలు నిమ్మ రుచి
పాపిన్స్ తింటారు




డికాట్రిక్స్‌తో పిల్లలు ఫోర్స్ ఫీల్డ్‌ని రూపొందిస్తారు.
అది క్యారేజ్ పడకుండా క్యుషన్‌లా
ఏర్పడుతుంది.



ఇప్పుడు ఆ క్యారేజ్ సురక్షితంగా నేల
మీదకు వస్తుంది, పిల్లలు చిన్నారులు బయటకు
వచ్చేందుకు తోడ్పడతారు.




చిన్నారులు మరియు అక్కడవున్నవారందరు
వారి చురుకైన ఆలోచన మరియు తక్షణ
చర్యను ఎంతో అభినందిస్తారు.



# ఇప్పుడు మేము చెబుతాం
# ఇక పెద్దలు వింటారు




క్రికెట్ మాటే చెప్పుకోవాలంటే.

మ్యాక్స్ ఇస్తోంది మా పిల్లలకై ఎక్స్‌ట్రా ఇన్నింగ్స్ టి 20లో వచ్చే ఒక అవకాశాన్ని.

ఇక్కడ పిల్లలు మాట్లాడతారు, మరి పూర్తి ప్రపంచం వింటుంది! మ్యాక్స్ ఎక్స్‌ట్రా ఇన్నింగ్స్ టి 20 జూనియర్.

ఆడిషన్స్: 16 జనవరి నుండి 7 ఫిబ్రవరి 2010 వరకు.

**రిజిస్టర్ చేసుకునేందుకై కాల్ చెయ్యండి 5052525***




**Deewana bana de**

Radio Partner BIG 92.7 FM

*షరతులు వర్తిస్తాయి. షరతులకై లాగ్ ఆన్ చెయ్యండి www.maxtelevision.comపై. కేవలం ఎంపికోబడ్డ నెట్‌వర్క్స్‌పై. ఛార్జీలు ప్రతి నిమిషానికి రూ. 6 వరకు.

సంపుటి: 63 ఫిబ్రవరి 2010 సంచిక: 2

పేరు.................................... వయస్సు.......

చిరునామా..................................................

..............................................................

..............................................................

ఫోన్:................. ఇ-మెయిల్:..............................

## మీ మనసులో మాట చెప్పండి!

మీ అభిప్రాయాలను ఒక్కొక్క కథకు/శీర్షికకు నేరుగా ఉన్న గళ్ళల్లో టిక్ చేసి చుక్కల గీత గుండా కత్తిరించి మీ ఫీడ్‌బ్యాక్‌ను పోస్టు ద్వారా మాకు పంపండి.

| అత్యుత్తమం | ఉత్తమం | బావుంది | ఫరవాలేదు | మామూలు |
|---|---|---|---|---|
| ☐ | ☐ | ☐ | ☐ | ☐ |
| ☐ | ☐ | ☐ | ☐ | ☐ |
| ☐ | ☐ | ☐ | ☐ | ☐ |
| ☐ | ☐ | ☐ | ☐ | ☐ |
| ☐ | ☐ | ☐ | ☐ | ☐ |
| ☐ | ☐ | ☐ | ☐ | ☐ |
| ☐ | ☐ | ☐ | ☐ | ☐ |
| ☐ | ☐ | ☐ | ☐ | ☐ |
| ☐ | ☐ | ☐ | ☐ | ☐ |
| ☐ | ☐ | ☐ | ☐ | ☐ |
| ☐ | ☐ | ☐ | ☐ | ☐ |
| ☐ | ☐ | ☐ | ☐ | ☐ |
| ☐ | ☐ | ☐ | ☐ | ☐ |
| ☐ | ☐ | ☐ | ☐ | ☐ |
| ☐ | ☐ | ☐ | ☐ | ☐ |
| ☐ | ☐ | ☐ | ☐ | ☐ |
| ☐ | ☐ | ☐ | ☐ | ☐ |
| ☐ | ☐ | ☐ | ☐ | ☐ |
| ☐ | ☐ | ☐ | ☐ | ☐ |
| ☐ | ☐ | ☐ | ☐ | ☐ |
| ☐ | ☐ | ☐ | ☐ | ☐ |

**Editor, CHANDAMAMA INDIA LTD.,**
B-3, Lunic Industries, Cross Road 'B',
MIDC, Andheri (East), Mumbai-400093.

T

# ఈ సంచికలో...

## చందమామ

# పరీక్షలకు సిద్ధమవుదాం!

ప్రియ మిత్రులారా!

కొత్త సంవత్సరం రెండో నెల వచ్చేసింది. నెమ్మదిగా పరీక్షల గురించిన ఎరుక మనల్ని చుట్టుముడు తోంది. మా మునుపటి సంపాదకీయాలలో మేమూ సూచించినట్లుగా భావనలను అర్థం చేసుకోకుండా బట్టీపట్టడం కంటే వాటిని నేర్చుకుని, అవగాహన చేసుకోవడం చాలా ముఖ్యం. అమీర్ ఖాన్ ఇటీవలే తీసిన 'త్రీ ఇడియట్స్' సినిమాలో ఈ విషయాన్ని చాలా బాగా చెప్పారు. చందమామకు సంబంధించి నంత వరకు మేము కూడా పాఠకులు తాము చదువుతున్న పాఠ్యాంశాలను చక్కగా అర్థం చేసుకోవడంలో సాయపడేందుకు మా వంతు సహాయం చేయాలని అనుకుంటున్నాము. సంవత్సరం ముందుకు సాగే కొద్దీ మీకు వాటిని అందించగలము.

దశాబ్దాలుగా చందమామ చిత్రకారులు చిత్రించిన చిత్రాల సంకలనాన్ని ఈ నెలలో మేము విడుదల చేయనున్నాము. రాబోయే నెలల్లో కృష్ణుడు, జానపదకథలు, ప్రకృతిశక్తులపై మరో మూడు సంకల నాలను కూడా తీసుకున్నాము. గతంలో మా ప్రచురణలకు లాగే వీటిని కూడా మీరు ఆదరించగలరని విశ్వసిస్తున్నాము. త్వరలోనే ఇంగ్లీష్ చందమామను చందాదారులు డౌన్‌లోడ్ చేసుకుని ఎలెక్ట్రానిక్ రూపంలో చదవడం కోసం అమెజాన్ ఇ-బుక్ అయిన 'కిండెల్'లో అందుబాటులోకి తీసుకురావడం జరుగుతుంది. ఆ విధంగా కొత్తసంవత్సరం చేసుకున్న నిర్ణయాలను కొన్నిటిని అమలు చేసినట్లవుతుంది.

ఫిబ్రవరి 12న డార్విన్ డే - ప్రపంచ ప్రసిద్ధ జీవశాస్త్రజ్ఞుడు చార్లెస్ డార్విన్ జన్మదినం. జీవితకాలంలో తను కనుగొన్న ఆవిష్కరణలను, ప్రతిపాదించిన సిద్ధాంతాలను జీవజాతుల పుట్టుక - ఆరిజన్ ఆఫ్ స్పీసిస్ - గ్రంథంలో వివరించారు. ఈ పుస్తకం విజ్ఞానశాస్త్రంలో మన ఆలోచనలను విప్లవీకరించింది. ఈ సంవత్సరం అతడి 200 జయంతి కావడంతో ఎనలేని ప్రాముఖ్యత ఏర్పడింది.

అలాగే ఫిబ్రవరి 19న ఛత్రపతి శివాజీ జయంతి. అణచివేతకు వ్యతిరేకంగా జాతి జనులను కూడ గట్టిన గొప్ప పాలకుడు. ధర్మప్రభువు కూడా. తన ధైర్యసాహసాలు, జ్ఞానం, న్యాయవర్తన, అవలంబించిన గెరిల్లా ఎత్తుగడల కారణంగా 300 సంవత్సరాల తర్వాత కూడా ప్రజలు అతడిపై గౌరవాభిమానాలు కురిపిస్తున్నారు.

మా కొత్త పుస్తకాలను చదివి, మీ అభిప్రాయాలను తప్పక మాకు పంపించండి. ఎప్పటిలాగే ఈ నెల చందమామ కూడా సర్వాంగ సుందరమై మీ ముందుకు వస్తోంది.

-సంపాదకుడు




ఫిబ్రవరి 2010 Rs. 20/-
*Founded by* **B. Nagi Reddi and Chakrapani**

***Editor & Publisher :*** Prashant Mulekar
***Associate Editors :*** Sowmya Rajendran, R. Vaasugi, A. Prem Kumar, K. Raja Sekhara Raju
***Senior Artists:*** K.C. Sivasankaran (Sankar), Gandhi Ayya, P. Mahesh
***Artist :*** T. Venkatesan
***Creative Writer :*** R. Rama
***Layout Designer :*** K. Narendra Raju
**Sanjay B Thorat :** ***Head - Sales and Circulation***
**CHANDAMAMA INDIA LTD.,**
B-3, Lunic Industries, Cross Road 'B', MIDC, Andheri (East), Mumbai-400093
Phone +91 22 28312872 / 28311849
Mobile +91 9821017787
email : sanjay.thorat@chandamama.com
**Rajendra K Jadhav :** ***Asst. Manager - Circulation***
Mobile +91 9320565048
email : rajendra.jadhav@chandamama.com
**Subhankar Rej,** ***Asst. Manager - Sales & Circulation (East)***
Email: subhankar.rej@chandamama.com
Mobile +91 9474916267
***Bengaluru :***
**CHANDAMAMA INDIA LTD.,** 18, 10th Cross, Mayura Street, Papanna Lay Out, Outer Ring Road, RMV 2nd Stage, Bangalore-560094,
Phone +91 80 6655 1000
***Chennai :*** **K. Ravishankar,** ***Sales Officer - Circulation,*** Mobile +91 98414 00981
email : ravishankar.k@chandamama.com
***Business Development :*** **Ananth Prakash**
Mobile +91 98362 82202, 98351 82202
email : ananth.prakash@chandamama.com
***Content Head - Online :*** **Sowmya Bharadwaj**
email : online@chandamama.com
***Marketing Enquiries :***
email : marketing@chandamama.com
***Advertisement :***
email : sales@chandamama.com
***Subscription Queries:***
e-mail : subscription@chandamama.com
***Customer Cell :*** A B Sairam
Mobile: +91 9841983774
e-mail : sairam.ab@chandamama.com
***Production Executive :*** Panchakshari R Math
***Head Office :*** **CHANDAMAMA INDIA LTD.,**
B-3, Lunic Industries, Cross Road 'B', MIDC, Andheri (East), Mumbai-400093
Phone +91 22 28312872 / 28311849
Email : chandamama@chandamama.com
Website : www.chandamama.com

Printed and Published by Prashant Mulekar at Shruti Art Pvt. Ltd., Unit No.1, Gupta Mills Estate, Devidayal Industrial Compound, Darukhana, Reay Road (East), Mumbai - 400 010 on behalf of Chandamama India Limited, B-3, Lunic Industries, Cross Road 'B', MIDC, Andheri (East), Mumbai-400093. Editor : Prashant Mulekar

# పాఠకుల లేఖలు

 చందమామ సంపాదకులు, సిబ్బందికి నూతన సంవత్సర శుభాకాంక్షలు. చందమామలో తిరిగి పంచతంత్ర కథలు వేస్తున్నందుకు ధన్యవాదాలు. చందమామకు పాతకథలే జీవం. పాతాళదుర్గం సీరియల్ చందమామకే హైలెట్. ఇంకా రాతిరథం, విచిత్రకవలలు, గుండుభీమన్న, పరోపకారి పాపన్న, కీలుగుర్రం, తాతయ్య కథలు, తెనాలి రామలింగం వంటి పాత కథలు, సీరియల్స్ తిరిగి ప్రచురించండి. జానపద కథలు, పత్రిక ప్రతినెలా 3వ తేదీ లోపే మార్కెట్లో ఉండేలా చూడండి. చందమామ మరింత అభివృద్ధి చెందాలని, అందరూ చదివి ఆనందించాలని కోరుకుంటున్నాను.

 డిసెంబర్ చందమామ సంచికను చూశాను. నా మనసు కాస్తకుదుట పడింది. మళ్ళీ చందమామ పాత కొత్త సంస్కృతుల సమ్మేళనంగా, మాకు కాసింత ఊరటని, ఉల్లాసాన్ని కలిగిస్తూ వస్తోంది. ముఖ చిత్రం చక్కటి సొబగులని అందిపుచ్చుకుంది, కథలు ఎంతో ఆనందాన్ని పంచాయి. చిన్న కథలు మనసుని రంజింపచేస్తాయి. చిన్న కథలు, ఇరవై ఐదేళ్ళ నాటి కథలు పత్రికకి వన్నె తెస్తాయి, కావున వాటిని మరువవద్దని ప్రత్యేకంగా తెలియచేసుకుంటున్నాను. ధారావాహికల సంఖ్య రెండుకి మించకుండా చూస్తే బాగుంటుంది. వీటివల్ల చిన్న కథల సంఖ్య తగ్గిపోతోంది. జాతక కథలు, అక్బర్ బీర్బల్ కథలను యధాతథంగా కొనసాగించగలరని కోరుకుంటున్నాను, చందమామ సంస్కృతీ సంప్రదాయాలకి సంబంధించిన మార్పులలో కాస్త మెలకువ వహించమని మనవి.

 చందమామలో రామాయణ మధురఘట్టం, సన్నివేశాలు, చిత్రాలు ఆకట్టుకుంటున్నాయి. దేశభాషల పట్టీ బాగుంది. చిత్రాలు రంగులమయమై హాయి గొల్పుతున్నవి. ఫోటో వ్యాఖ్యల ఫోటో చివరి పేజీలో ఉంచండి. మన చరిత్రపుటల చారిత్రాత్మకాంశాలు కుతూహలంగా ఉన్నాయి.

మీ అభిప్రాయాలను ఈమెయిల్
feedback@chandamama.com
ద్వారా పంపవచ్చు.



**Visit us at : http://Telugu.chandamama.com**

# ఊ! సిద్ధూ సాధించాడు ! మళ్ళీ!

గిల్డా ఆంటీ చిన్నారి సిద్ధార్థ్‌ను కొబ్బరికాయలోని పోషక పదార్థాల ఉపకారాలను వ్రాయమన్నది. సిద్ధూ వాటిని సేకరించాడు. ఆంటీకి మెలుకువ వచ్చేలోగా త్వరగా వాటిని పరిశీలించి, సరిచేద్దామా!

ERBFI

CARSETARDBOHY

SINATVIM

MIRANSELA

RPOENIT





పీచుపదార్థాలు, కార్బోహైడ్రేట్లు, విటమిన్లు, మొదలగునవి కలిగియున్న అద్భుతమైన కాణాచి, కొబ్బరికాయ. బలంగా, ఆరోగ్యంగా ఎదుగుటకు కావలసిన అన్ని గుణాలు కలిగియున్నది.



**Coconut Development Board**
(Ministry of Agriculture, Government of India)
cdbkochi@dataone.in, www.coconutboard.gov.in



# రాజస్థాన్ జానపదకథ

## మౌన సాక్షి

ఓపర్యాయం తుకారాం నుంచి షేర్ సింగ్ పెద్ద మొత్తంలో డబ్బు అప్పుగా తీసుకున్నాడు. వారాలు గడిచిపోతున్నప్పటికీ షేర్ సింగ్ బాకీ తీర్చడంలేదు. దీంతో షేర్ సింగ్ ఇంటికి వెళ్లి తనకు బాకీ పడిన డబ్బు విషయం అతడికి గుర్తు చేయాలని తుకారాం నిర్ణయించుకున్నాడు.

షేర్ సింగ్ ఇంట్లోకి అడుగుపెట్టగానే, అప్పటికే ఎవరో అతిథులు అక్కడికి వచ్చి ఉండటం తుకారాం గమనించాడు. కాస్త సందేహపడినప్పటికీ బాకీ విషయమై షేర్ సింగ్‌ను కదపాలని తుకారం భావించాడు. అయితే తుకారాంని చూడగానే షేర్ సింగ్ ముఖం నల్లబడింది.



''నీకేం కావాలి? నేను అతిథులను సేవిస్తున్న విషయం కనబడలేదా?'' కసురుకున్నాడు.

''నా బాకీ గురించి నీకు గుర్తు చేద్దామనే వచ్చాను. వీలైనంత త్వరలో చెల్లించు'' తుకారాం చెప్పాడు.

షేర్ సింగ్ ఆ వారమే బాకీ మొత్తం చెల్లించడానికి అంగీకరించాడు. కాని అతిథుల ముందు తుకారాం బాకీ విషయం ప్రస్తావించడంతో షేర్ సింగ్ చిరాకుపడ్డాడు. తనకు అవమానం జరిగిందని తలిచాడు.

''ఈసారి తుకారాం పని పడతాను'' అనుకుంటూ షేర్ సింగ్ పళ్లు కొరికాడు.

నిజం చెప్పాలంటే తాను తీసుకున్న అప్పును చెల్లించే ఉద్దేశం షేర్ సింగ్‌కు లేనే లేదు. పైగా తుకారాంపై పగ తీర్చుకోవడానికి దీన్ని ఓ సాకుగా తీసుకున్నాడు.

షేర్ సింగ్ ఎదురుచూస్తున్న తరుణం రానే వచ్చింది. జనసంచారం లేని రహదారిలో ఓ రోజు అతడికి తుకారాం ఎదురు వచ్చాడు. తుకారాంను చూడగానే కత్తి దూసి అతడి ముందు ఆడించాడు.

''నా అతిథుల ముందు నన్ను అవమానిస్తావా, ఎంత సాహసం నీకు?'' గద్దించాడు షేర్ సింగ్.

కత్తి దూసిన షేర్ సింగ్‌ను చూసి ఒక్కసారిగా వణికిపోయిన తుకారం తేరుకుని అడిగాడు?

''బాకీ పడిన మొత్తాన్ని నీకు గుర్తు చేశాను తప్ప నేనేమీ అనలేదే. నా బాకీని ఎప్పుడు చెల్లించబోతున్నావు?''

షేర్ సింగ్ ఆగ్రహంతో గర్జిం చాడు. ''నీ ప్రాణాన్నే నేను బలిగొం టున్న విషయం తెలిసి కూడా నువ్వు డబ్బు అడుగుతున్నావా?''



తుకారం శాంతంగా జవాబి చ్చాడు. ''ఇలాంటి పరిణామా లకు నేను ఎప్పుడూ సిద్ధంగానే ఉన్నాను. నీలాంటి వాళ్ళను వందలాదిగా నేను కలుస్తూ ఉంటాను మరి!''

షేర్ సింగ్ కత్తి కిందికి దించాడు. ''ఏమం టున్నావు?'' అడిగాడు.

''నా భార్య వద్ద ఉత్తరం దాచే వచ్చానులే. నీవు నాకు బాకీపడ్డ డబ్బు వివరాలన్నీ దానిలో ఉన్నాయి. నీవు నాకు హాని తలపెట్టవచ్చని కూడా దాంట్లో పొందుపరచాను. చీకటి పడేలోగా నేను ఇంటికి తిరిగి రాకపోతే నా భార్య ఆ ఉత్తరాన్ని మన రాణా వద్దకు తీసుకెళుతుంది!'' తుకారాం తేల్చి చెప్పాడు.

దీంతో షేర్ సింగ్ వణికిపోయాడు. దీనిని అతడు ఏమాత్రం ఊహించలేదు. అలాగని తుకారాం నిజమే చెబుతున్నాడని కూడా రుజువు లేదు. అయతే అతడు ప్రమాదాలను కొనితెచ్చు కోవాలని అనుకోవడం లేదు. అమాయకులను వధించిన వారిపట్ల రాణా కఠినంగా వ్యవహరి స్తాడని అతడికి తెలుసు కూడా.

''నిన్ను ప్రాణాలతో విడిచిపెడతాను. నాకూ దయాదాక్షిణ్యాలు ఉన్నాయి '' షేర్ సింగ్ చెప్పాడు. ''అయితే నీ ముక్కు మాత్రం కోసే స్తాను!''

తుకారం దిగ్భ్రాంతి చెందాడు. ''నీవు బాకీ పడిన అప్పును నేను రద్దు చేసినట్లయితే నా ముక్కును వదిలివేస్తావా?''

షేర్ సింగ్ నవ్వాడు. ''వదిలేస్తాను'' అని చెప్పాడు. తుకారాంకి ఏ విధమైన చెల్లింపూ చేయనవసరం లేకుండా పోతున్నందుకు అతడు సంతోషపడ్డాడు.

''నా బాకీ మొత్తం తీర్చేశావని నీకు రాసి స్తాను. కాని మనకు ఓ సాక్షి అవసరం'' చెప్పాడు తుకారాం. ఇలా హామీపత్రం రాసివ్వడానికి గాను తుకారంపై తాను వత్తిడి తీసుకువచ్చిన విషయం ఎవరికీ తెలియనివ్వకూడదని షేర్ సింగ్ తలిచాడు. సాక్షి రాణాకు నివేదిస్తే తాను చిక్కుల్లో పడడం ఖాయం మరి.

''మనకు సాక్షులెవరూ అవసరం లేదు. నువ్వు ఇక్కడ సంతకం పెట్టు చాలు.'' షేర్ సింగ్ కరుకుగా చెప్పాడు.

''అలా చేయవచ్చనే అనుకుంటున్నా. అయితే నీ పత్రం చెల్లదు మరి!'' తుకారాం చెప్పాడు.

షేర్ సింగ్ చుట్టూ కలియజూశాడు. రహ దారికి ఓ వైపున ఓ పెద్ద మర్రిచెట్టును చూశాడు. ఈ పత్రం ఏ పరిస్థితుల్లో రూపొందిందో మర్రి చెట్టు చెప్పలేదు. కాబట్టి మర్రిచెట్టునే మంచి సాక్ష్యంగా పెట్టుకోవాలని అతడు నిశ్చయించుకు న్నాడు.

''చూడు మిత్రమా! ఈ మర్రిచెట్టే మన సాక్షి'' చెప్పాడు షేర్ సింగ్. తుకారం తలూపాడు. తన చిట్టా పుస్తకం తీసుకుని ఓ పత్రంలో ఆ విధంగా రాసి ఇచ్చాడు. ఆ దృశ్యం చూడగానే తబ్బిబ్బయిన షేర్ సింగ్ పత్రం తీసుకుని ఉన్నఫళాన ఇంటికి పరుగెత్తాడు.

అయితే అతడి సంతోషం త్వరలోనే ఆవిరయి పోయింది. ఆ మరుసటి దినమే రాణా అతడిని పిలిపించాడు. రాణా ఆస్థానంలో ప్రవేశించగానే తుకారాం అక్కడ నిలబడి ఉండటం చూశాడు.

''తుకారాంకు నీవు అప్పుపడిన మాట నిజమేనా?'' అడిగాడే రాణా.

''అవును ప్రభూ!'' చెప్పాడు షేర్ సింగ్.

''నీ అప్పు తిరిగి చెల్లించావా?'' రాణా ప్రశ్నించాడు.

''అవును చెల్లించేశాను ప్రభూ!'' షేర్ సింగ్ విజయగర్వంతో నవ్వుతూ రుణపత్రం చూపించాడు.

రాణా దానికేసి చూశాడు. చూసి పక్కున నవ్వాడు.

''నీ సాక్షి మర్రి చెట్టా?'' రాణా ప్రశ్నించాడు.

''అవును ప్రభూ, ఆ సమయంలో ఎవరూ లేరు. చెప్పారు షేర్ సింగ్.

''అంటే జనసంచారం లేని దారిలో నువ్వు ఈ నిరుపేదను హెచ్చరించావన్నమాట?'' రాణా గొంతులో కాఠిన్యం ధ్వనించింది.

''లేదు ప్రభూ, కలలో కూడా ఆ పని చేయలేదు. ఆ సమయంలో ఆ దారంట ఎవరూ నడిచి వెళ్లలేదు మరి!''

''ఏదేమైనా రుణపత్రం చెల్లదు.'' రాణా ఆ పత్రాన్ని షేర్ సింగ్‌కు తిరిగి ఇచ్చి వేస్తూ చెప్పాడు. ''దీంట్లో తుకారం సంతకం లేదు. సాక్షి సంతకం మాత్రమే ఉంది!''

షేర్ సింగ్ అప్పుడు ఆ పత్రంకేసి చూశాడు. రాణా చెప్పింది నిజమే. తుకారాం ఆ పత్రంలో సంతకం చేయలేదు. బదులుగా సాక్షి సంతకం ఉండవలసిన చోట అతడు మర్రి చెట్టు అని రాశాడు. అప్పు చెల్లించనవసరం లేదనే ఉద్వేగంలో ఉన్న షేర్ సింగ్ దాన్ని గమనించలేకపోయాడు.

అప్పుడు రాణా చెప్పాడు. ''ఇప్పుడిక్కడ మేమంతా ఉన్నాం కాబట్టి, నీవు తుకారాంకు బాకీ పడిన మొత్తాన్ని ఎందుకు చెల్లించకూడదు? ఈ సారి మంచి సాక్షిని వెదుక్కో మరి!'' ఆస్థానంలో ఉన్నవారు ఫక్కున నవ్వారు.

షేర్ సింగ్ నుంచి తుకారాం తప్పించుకోవడమే కాకుండా ఇచ్చిన అప్పును కూడా తిరిగి ఎంతో తెలివిగా రాబట్టుకోగలిగాడు కదూ!



## బేతాళ కథలు

# సన్యాసి వరాలు!

పట్టు వదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగివెళ్ళి, చెట్టు పైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, నువ్వు ఈ అపరాత్రివేళ, స్వార్థంకొద్దీ ఏమైనా అపూర్వశక్తులు సంపాయించాలని ఇంత శ్రమపడుతున్నావో, లేక ఇతరులకు మేలుచేయాలన్న ఉదార గుణంతో ఇన్ని ఇక్కట్లను ఓర్చుకుంటున్నావో తెలియడంలేదు. కానీ, ఈ అపూర్వ అలౌకిక శక్తుల ప్రభావం కొన్ని సందర్భాలలో చిత్ర విచిత్రంగా వుంటుంది. ఇందుకు ఉదాహరణగా శంకరుడు, కాళీపాదుడు అనే వాళ్ళకథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు:

పూర్వం మాళదేశంలోని ఓ పల్లె గ్రామంలో, ధర్మపాలుడనే ఒక చిన్న రైతు వుండేవాడు. అతడికి శంకరుడనే ఒక కొడుకుండేవాడు. తల్లిలేని శంకరుణ్ణి, ధర్మపాలుడు అల్లారు ముద్దుగా పెంచాడు. ఆ ముద్దుమురిపాలతో




రెట్టింపు అయ్యాయి. కనకవల్లి గయ్యాళి తనం రోజు రోజుకూ పెరగసాగింది. అయినా శంకరుడిలో - మాత్రం ఎలాంటి మార్పూ రాలేదు.

ఒకరోజున, పట్నంలో స్థిరపడిన శంకరుడి చిన్ననాటి స్నేహితుడొకడు అతణ్ణి చూడ వచ్చాడు. శంకరుడు భార్యతో, "ఈ పూట నా స్నేహితుడికి కూడా వంటచెయ్యి," అన్నాడు.

ఆ మాట వింటూనే కనకవల్లి తాటి ప్రమాణాన శంకరుడిమీద విరుచుకుపడి, "చిల్లిగవ్వ సంపాయించలేని నీకు, వండి వడ్డించడమే దండగపని! ఇప్పుడేమో నీ స్నేహితుడిక్కూడా వంట చెయ్యమంటు న్నావు. దారేపోయే దానయ్యలకు విందులు చేయడానికిది ధర్మసత్రం కాదు," అన్నది చేతిలోని పులుసు గరిటెను తిప్పుతూ.

అరుగుపై కూర్చున్న శంకరుడి స్నేహి తుడు, కనకవల్లి అన్న మాటలు విని హడలి పోయి, అప్పటికప్పుడే అక్కడి నుంచి వెళ్ళి పోయాడు.

స్నేహితుడు అలా వెళ్ళిపోవడం ఎంతో అవమానం అనిపించి, అప్పటికే భార్య గయ్యాళి తనంతో విసిగివున్న శంకరుడు, ఇల్లు వదిలి బయలుదేరాడు.

వాడు పల్లెకు అల్లంత దూరంలో వున్న అడవికి అడ్డంపడి చాలాదూరం నడిచాడు. ఆ సరికి చీకటిపడబోతున్నది. అంతలో, "ఎవరు నువ్వు? చీకటి కమ్ముకుంటున్నది. అడవిలో ఈ సమయంలో ఇంకా ముందుకు

వాడికి చదువు సంధ్యలు ఏమాత్రం అబ్బక పోగా, వల్లమాలిన పనిబద్ధకం కూడా తోడైంది. పెళ్ళిచేస్తే కొడుకు దారిలోకి వస్తాడని ధర్మ పాలుడు, శంకరుడికి, దూరపుబంధువుల పిల్ల కనకవల్లితో పెళ్ళి జరిపించాడు.

అయితే, భార్య కనకవల్లి ఎన్ని ప్రయ త్నాలు చేసినా శంకరుడిలో మార్పు రాలేదు. వాడు కడుపునిండా తిని, అది అరిగేదాకా ఊరంతా తిరిగి వస్తూండేవాడు. దానితో బాగా విసిగిపోయిన కనకవల్లి, శంకరుడి మీదా, అటువంటి కొడుకును తనకు అంటగట్టిన మామ ధర్మపాలుడిమీదా అమితమైన కసి పెంచుకుని, అనుక్షణం గట్టిగా అరుస్తూ, వాళ్ళను సాధించడం ప్రారంభించింది.

తర్వాత కొన్నాళ్ళకు ధర్మపాలుడు పోయాడు. అప్పటినుంచీ శంకరుడిపాట్లు

పోవడం ప్రమాదం!'' అన్న మాటలు విని పించి, శంకరుడు అటుకేసి తిరిగి చూశాడు.

దాపుల ఒక ఎత్తయిన రాళ్ళగుట్టమీద, ఒక సన్యాసి కూర్చుని వున్నాడు. శంకరుడు గబగబా ఆయన దగ్గరకు వెళ్ళాడు. సన్యాసి ముఖంలో ఏదో తేజస్సు కనిపించింది, శంకరుడికి.

శంకరుడు, సన్యాసి కాళ్ళ దగ్గర కూల బడి, భార్య గయ్యాళితనం కారణంగా తను పడుతున్న కష్టాలన్నీ వెళ్ళబోసుకుని, ''స్వామీ! ఇక నాలో ఆ గయ్యాళి భార్యతో వేగే ఓపికలేదు. ఆవిడ గయ్యాళి తనం పోగొట్టే భారం తమదే. అలా కానప్పుడు, తమకు పరిచర్యలు చేస్తూ, అడవిమధ్య ఈ రాళ్ళగుట్టమీద తమతోనే వుండిపోతాను,'' అన్నాడు. సన్యాసి, శంకరుడికేసి ముందు చిరు కోపంగాచూసి, తర్వాత చిరునవ్వు నవ్వి, ఒక క్షణకాలం తలాడించి కళ్ళుమూసు కుని, పక్కనేవున్న కమండలంలోని నీళ్ళు చేతిమీద ఒంపుకుని, '' ఆ కనకవల్లి గయ్యా ళితనం సమూలంగా నశించాలి!'' అన్నాడు నీళ్ళను నేలమీదికి జారవిడుస్తూ.

తర్వాత సన్యాసి శంకరుడితో, ''నాయనా, ఈ కమ్ముకుంటున్న చీకట్లో ఇంకా అడవి లోకి వెళ్ళడం ప్రమాదంకాని, బయటికి పోవ డంలో ఎలాంటి ఇబ్బందీ వుండదు. ఇప్పుడే తిన్నగా ఇంటికిపోయి, ఆ గయ్యాళి కనకవల్లి తీరు ఎలావున్నదో గమనించు,'' అన్నాడు.

శంకరుడు సన్యాసి పాదాలు తాకి, ఇల్లు చేరేసరికి బాగా చీకటి పడిపోయింది. కనక



వల్లి, శంకరుణ్ణి గుమ్మం ముందుచూస్తూనే వెళ్ళి కాళ్ళమీదపడి, ''నన్ను క్షమించండి! ఇన్నాళ్ళుగా అనరాని మాటలతో మిమ్మల్ని వేధించాను. నా పాపానికి ప్రాయశ్చిత్తం లేదు,''అన్నది కళ్ళనీళ్ళతో.

శంకరుడి ఆనందానికి అంతులేదు. వాడు జరిగినదంతా భార్యకు చెప్పి, ''నీలో వచ్చిన మంచి మార్పుకు కారణం, ఆ సన్యాసి ఇచ్చిన వరం!'' అన్నాడు.

ఆ మాటలు విని ఆశ్చర్యపోయిన కనక వల్లి, ''చెప్పరేం మరి! దేవతలు వరాలిచ్చే కాలం చెల్లిపోయి, సన్యాసులు వరాలిచ్చే కాలం వచ్చిందన్నమాట! ఎవరిదైతేనేం వరం వరమే!'' అంటూ తన చేతుల కేసి కొద్దిసేపు పరీక్షగా చూసుకుని, ''నా శరీరపు రంగు బాగా మెరుగవడంతోపాటు, కాస్త స్థూలం





కూడా తగ్గేట్టు, ఆ సన్యాసిని వరం అడిగి రండి,'' అన్నది.

చేసేదిలేక మర్నాడు శంకరుడు మళ్ళీ సన్యాసిదగ్గరకు వెళ్ళి, భార్య అందంగా మారే వరం సంపాయించి, ఇల్లు చేరేసరికి, మిరుమిట్లుగొలిపే అందచందాలతో స్వాగతం పలికింది, కనకవల్లి.

మరుసటి రోజు ఆమె, శంకరుడితో, ''ఎన్ని మంచి కూరగాయలూ, ఆకుకూరలూ ఉన్నా, నాకు రుచిగా వంట చేయడం చేతగాదు. ఇది మా ఇంటి ఆడపడుచులకు, పూర్వం ఓర్వలేనివాళ్ళెవరో ఇచ్చిన శాపం. సన్యాసిని అడిగి, నేను రుచిగా వంటచేయగల వరం సంపాయించుకు రండి,'' అన్నది. శంకరుడు అయిష్టంగానే సన్యాసి దగ్గర, ఆ వరంకూడా సంపాయించుకు వచ్చాడు.

ఒక వారం రోజులు గడవనిచ్చి కనకవల్లి, శంకరుడితో, ''నాకు అందచందాలు వచ్చినై. కమ్మగా వంట చేయగల శక్తీ అబ్బింది, అయినా ఏం లాభం! మన పేదరికం మాత్రం వదిలిందికాదు. మీరు మరొకసారి పోయి, మనకు సర్వసంపదలతో సుఖంగా జరిగిపోయే వరం కోరి రండి,'' అన్నది.

ఈసారి శంకరుడు కాస్త విసుక్కుంటూనే అడవికి వెళ్ళాడు. కానీ అక్కడ రాళ్ళగుట్ట మీద సన్యాసి కనిపించలేదు. వాడు చుట్టుపక్కల చాలా దూరం వెతికి చూసి నిరాశగా ఇంటిదారి పట్టాడు. వాడు పల్లె మొగలో వున్న పూటకూళ్ళ బస ముందుకు రాగానే, ''నీ సమస్యలన్నీ తీరిపోయాయి కదా? ఇప్పుడు సంతోషంగా వున్నావా, శంకరా?'' అంటూ ఒకతను పలకరించాడు.

గడ్డం తీసివేయడంతో శంకరుడికి, సన్యాసిని గుర్తించడం వెంటనే సాధ్యపడిందికాదు. వాడు ఆయన్ను గుర్తించగానే ఆశ్చర్యంతో, ''స్వామీ, ఇదేమిటి? మీ గడ్డం, కాషాయ వస్త్రాలూ ఏమయినై?'' అని అడిగాడు.

దానికి సన్యాసి నవ్వి, ''నా పేరు కాళీపాదుడు. ఎవరో గొప్ప వివేకి చెప్పినట్టు, భార్య అనాకారితనం భరించడం అతి సులభం; గయ్యాళితనం భరించడం మహాకష్టతరం. నా భార్యలోవున్న ఈ రెండు లక్షణాలూ భరించలేక, నేను సన్యాసం స్వీకరించాను. అయితే, ఆరేళ్ళ ధ్యానఫలంగా వాక్శుద్ధి కలిగి, నేనన్న మాటలు ఫలించి నీ కాపురం చక్కబడింది. అది చూశాక, నా కాపురాన్ని కూడా చక్కదిద్దు

కోవచ్చునన్న విశ్వాసం కలిగి, కాషాయం విసర్జించి, మా ఊరికి బయలుదేరాను,'' అన్నాడు.

ఇది విన్న శంకరుడు నిలువునా కుప్ప కూలిపోతూ, ''స్వామీ! ఆరేళ్ళకాలంగా ధ్యానంలో వున్నారు. మరొక్క రోజంటే ఒక్క రోజు - ఆ ధ్యానం కొనసాగిస్తే, మీ సొమ్మేం పోయేది? మీరు మాకు సర్వ సంపదలతో సుఖంగా బతికే వరం ఇస్తారన్న కొండంత ఆశతో, ఆ కారడవిలోని రాళ్ళ గుట్ట దగ్గరకు వెళ్ళి చూసి మీరు కనిపించక పోయేసరికి నిరాశతో ఇలా తిరిగి వస్తున్నాను,'' అన్నాడు.

శంకరుడి మాటలకు సన్యాసి కాళీ పాదుడు పెద్దగా నవ్వి, ''శంకరా! కష్టే ఫలీ అన్నారు పెద్దలు. బద్ధకపిశాచిని దూరంగా తరిమి, చేతనైన పనిలో కష్టించడమే, సుఖంగా బతికేందుకు మార్గం. మళ్ళీ ఏదో ఒకనాడు కలుసుకుందాం. ఇక్కడికి మా ఊరు చాలాదూరం. చీకటి పడక ముందే ఇల్లు చేరాలి,'' అంటూ అక్కణ్ణించి కదిలాడు.

కాళీపాదుడు తన ఊరు చేరేసరికి బాగా చీకటిపడింది. అతడు ఉత్సాహంగా తన ఇంటిని సమీపించాడు.

ఆ సమయంలో తెరిచివున్న కిటికీలో నుంచి అతడి భార్య బాలామణి, పదేళ్ళ కూతురునూ, ఎనిమిదేళ్ళ కొడుకునూ కసురుకుంటూ అంటున్న మాటలు అతడికి వినిపించినై:

''కట్టుకు పోగలిగినంత ఆస్తిపాస్తుల్ని, మీ తాత వదిలిపోయాడు; అయినా ఏం



లాభం! వాటిని కాపాడే నాథుడు లేడు. సరైన అదుపు లేక మీకు చదువులు అబ్బడంలేదు. మరి ఐదారేళ్ళలో మీ పెళ్ళిళ్ళు.

ఇన్ని భారాలు నేను మోయగలనా! మీ నాన్న పెద్ద కిరాతకుడు! నేను గయ్యాళినే కావచ్చు. కాని లోకంలో గయ్యాళి భార్యల భర్తలందరూ ఇల్లొదిలి సన్యాసుల్లో కలిసిపోతున్నారా? ఆ లెక్కన కోపదారులైన భర్తలున్న భార్యలందరూ ఏ సన్యాసుల్లో కలవడమో లేక ఏ నూతిలోనో దూకి చావడమో చేయక తప్పదు. ఛీ!''

ఆ తర్వాత ఏదో కంచులోటా గోడకు ఠపీమంటూ కొట్టుకున్న పెద్ద శబ్దమైంది. కాళీపాదుడు వెనుదిరగబోయి ఒక క్షణం ఆగి, తర్వాత మూసివున్న తలుపు దగ్గరకు

నడిచి, ''బాలా! నేను తిరిగి వచ్చాను, తలుపు తియ్యి,'' అంటూ తలుపుమీద కొట్టాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, శంకరుడు ఏ శ్రమా ప్రయాసల్లేకుండానే, తన భార్య గయ్యాళితనాన్ని పోగొట్టేందుకు, సన్యాసి కాళీపాదుడి నుంచి సాయంపొంది, తన సమస్యకు పూర్తి పరిష్కారం సాధించాడు. కానీ, తన ఆరేళ్ళ ధ్యానంద్వారా వాక్శుద్ధిని పొందిన కాళీపాదుడికి మాత్రం, తన భార్య గయ్యాళి తనం నుంచి విముక్తి కలిగినట్టు లేదు. రోగికి తన చికిత్సద్వారా వ్యాధినివారణ చేసినవైద్యుడు, తనకున్న అదే తరహా వ్యాధిని చికిత్సద్వారా నయం చేసుకోలేకపోవడం వింతల్లో వింత కాదా? ఈ సందేహాలకు సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''సన్యాసి కాళీపాదుడికి, తన సన్యాసం మీదా, ధ్యానం మీదా మొదట్లో అంతగా నమ్మకం వున్నట్టు కనబడదు. ఐతే, తన మాటలు శంకరుడికి మంచి ఫలితాన్నిచ్చిన తర్వాత, తనకు వాక్శుద్ధి లభించిందని గ్రహించాడు. ఆ కారణంగానే అతడు, అడవిలో తన ధ్యానానికి స్వస్తి పలికి, తన భార్య గయ్యాళితనాన్ని కూడా పోగొట్టి, తిరిగి గృహస్థజీవితంలో కుదురుకుందామని ఇంటికి బయలుదేరాడు. కానీ, అతడి ధ్యాన వాక్శుద్ధులు, ఆమె మీద ఏమాత్రం ప్రభావం చూపినట్టు లేదు. ఇల్లు చేరి, ఆమె గయ్యాళి మాటలు విని, తిరిగి అడవికి పోదామనుకున్న అతడికి – ఆమె, భార్యల గయ్యాళితనాన్ని గురించీ, భర్తల కోపదారితనాన్ని గురించీ అన్నమాటల్లో ఎంతో సత్యమున్నట్టు తోచింది. అందువల్లనే తలుపుకొట్టి భార్యను కేకవేశాడు. తన ధ్యాన శక్తిని పరుల ప్రయోజనానికి కాక తన స్వప్రయోజనం కోసం ఉపయోగించుకోవాలన్న స్వార్థ చింతన కలగడం, అతడు భార్య విషయంలో విఫలుడవడానికి ముఖ్యకారణం,'' అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతోసహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. –(కల్పితం)

[ఆధారం : మాచిరాజు కామేశ్వరరావు రచన]



# ఆర్య

## మాణిక్య ద్వీప అన్వేషణ

13

చిత్రాలు: గాంధి అయ్య

ధార్విక్(ప్రభాత్) ధర్మపిత కుమారుడని మనం తెలుసుకున్నాము. గుహ నుండి కనిపించకుండా పోయిన పిల్లలను తీసుకుపోవడానికి అతడు ప్రయత్నిస్తున్నాడు.




ధార్విక్ తన పథకాన్ని వివరిస్తుండగా ధర్మపిత ఆందోళనతో వింటున్నాడు.
లేదు. ఆమెకు నేను ద్రోహం చేయలేను!
అలాగయితే చేతులారా నీ బిడ్డల రక్తం నువ్వే చూడక తప్పదు!
ఆగు! నువ్వు చెప్పింది చేస్తాను!
బాగు బాగు! మాణిక్యం త్వరలో నా సొంతమవుతుంది.
నీ పేరాశే నీ పతనానికి దారితీస్తుంది.
అర్ధరాత్రి వేళ గుహ వద్దకు రా.
ఈ విషయం ఆర్యతో చెప్పకు. లేదా... ఫలితం అనుభవిస్తావు!

ధర్మపిత గుహవైపుకు నడిచి వెళుతుండగా దారిలో ఆర్య ఎదురయ్యాడు.












ధర్మపిత ఉద్దేశాలతో ఆర్య ఏకీభవించలేక పోయాడు.




నా సమయం వృథా చేయకు రాజా. నన్ను వెళ్ళనివ్వు.
అంత సులువు కాదు. పిల్లలెక్కడ ఉన్నారో ముందు చెప్పు!
మీ మంత్రి ప్రభాత్‌ను ఎందుకు ప్రశ్నించవు? తనిఖీ చేయడానికి అతడిని నువ్వు ఇక్కడికి పంపలేదా?
అది నీకెలా తెలుసు?
తమ సంతానం ఎక్కడుందో తెలుసుకోవలసిన కర్తవ్యం ప్రతి తల్లిదండ్రుల మీదా ఉంది.
ప్రభాత్ నీ కుమారుడా?
అవును, అతడి నుంచి కాపాడటానికే నిన్ను ఇక్కడికి తీసుకొచ్చాను.
(ఇంకా వుంది)



# రామాయణం

## యుద్ధ కాండ - 14

విభీషణుడు వెళ్ళి పుష్పక విమానం తెచ్చి రాముడి ముందుంచాడు. అది చాలా పెద్దది. అందులో బంగారంతో చేసిన భాగాలున్నాయి. వైడూర్య మణులతో చేసిన ఆసనాలున్నాయి. దానికి బంగారు కమలాలూ, గజ్జెలూ, ఘంటలూ ఉన్నాయి.

''విభీషణా, వానరులు మహత్తరమైన కార్యం సాధించారు. వారిని కానుకలతో సంతోషపెట్టు. అందువల్ల నీకు గొప్ప కీర్తి కలుగుతుంది,'' అని చెప్పి రాముడు సీతా లక్ష్మణులతో సహా పుష్పకం ఎక్కాడు. అతను సుగ్రీవుడూ మొదలైన వారికీ, విభీషణుడికీ వీడ్కోలు చెప్పి, తాను అయోధ్యకు తిరిగి పోవటానికి వారి అనుమతి కోరాడు.

''మమ్మల్ని కూడా నీ వెంట తీసుకుపోతే మేం నీ పట్టాభిషేకం చూసి ఆనందిస్తాం,'' అన్నారు వాళ్ళంతా. ''అలా అయితే మరీ సంతోషం,'' అని రాముడు అందరినీ ఎక్కించుకుని పుష్పకం ఆకాశంలోకి లేచింది. అంత మంది ఎక్కినా విమానం ఇరుకనిపించలేదు.

విమానం పోతూ ఉంటే రాముడు సీతకు రాక్షస వీరులు యుద్ధ భూమిలో చనిపోయిన స్థలాలూ, సేతువూ, విభీషణుడు తనను కలుసుకున్న చోటూ మొదలైనవి చూపుతూ వచ్చాడు. కిష్కింధ కనుచూపు మేర లోకి రాగానే సీత, తార మొదలైన సుగ్రీవుడి భార్యలనూ, ఇతర వానర వీరుల భార్యలనూ, తన వెంట తీసుకుపోవాలన్న కోరికను వెల్లడించింది. రాముడు సరేనని పుష్పకాన్ని కిష్కింధలో దింపి, సీత కోరికను








క్రమంగా విమానం అయోధ్యకు చేరవచ్చింది. వానర రాక్షసులందరూ లేచి నిలబడి దూరాన కనిపించే అయోధ్యా నగరాన్ని ఆసక్తితో చూశారు. కాని రాముడు తిన్నగా అయోధ్యకు వెళ్ళక భరద్వాజాశ్రమంలో దిగి, భరద్వాజమహాముని ద్వారా భరతుడి యోగ క్షేమాలూ, తన తల్లుల యోగక్షేమాలూ తెలుసుకున్నాడు. అతను చైత్రశుద్ధ పంచమి నాడు అయోధ్య నుంచి వనవాసం బయలుదేరాడు. ఇవాళ చైత్రశుద్ధ చవితి. ఈ రోజుతో సరిగా పధ్నాలుగేళ్ళు నిండాయి. ఆ రోజు రాముడు తన ఆతిథ్యం స్వీకరించి మర్నాడు అయోధ్యకు వెళ్ళాలని భరద్వాజుడు కోరాడు.

రాముడు హనుమంతుణ్ణి పిలిచి, ''నీవు అయోధ్యకు వెళ్ళు. దారిలో శృంగిబేరపురంలో గుహుణ్ణి కలుసుకుని నా క్షేమ సమాచారాలు చెప్పు. నాకతను ప్రాణం లాంటి వాడు. అతని ద్వారా నీకు అయోధ్య వార్తలు తెలుస్తాయి. నా క్షేమ సమాచారం విని అతను చాలా సంతోషిస్తాడు. అయోధ్యకు వెళ్ళి భరతుడికి మన వార్తలన్నీ వివరంగా చెప్పు. నా విజయవార్త విన్నప్పుడు భరతుడి ముఖంలో ఏ మార్పులు కలిగేదీ శ్రద్ధగా గమనించు. ఇంత కాలం రాజ్యభోగాలనుభవించిన వాడికి అవన్నీ పోతాయంటే బాధగానే ఉంటుంది. అందుచేత అతని మనోభావం సరిగా గ్రహించు. అతనికే రాజ్యం చెయ్యాలని ఉంటే అలాగే చెయ్యవచ్చు. అతనికలాంటి కోరిక ఉన్నట్టు తోస్తే, మేం

సుగ్రీవుడికి తెలిపాడు. సుగ్రీవుడు తన అంతఃపురానికి వెళ్ళి, తారతో వానరవీరుల భార్యలందరినీ ప్రయాణం చెయ్యమన్నాడు. తార వానర స్త్రీలనూ ప్రయాణానికి సిద్ధం చేసింది. వారందరూ బాగా అలంకారాలు చేసుకుని, సీతను చూడాలన్న అభిలాషతో వచ్చారు.

వానరవనితలందరినీ ఎక్కించుకుని విమానం మళ్ళీ ప్రయాణం సాగించింది. సీతకు రాముడు ఋశ్యమూకం మీద తనను సుగ్రీవుడు కలుసుకున్న చోటు చూపించాడు. అలాగే అతను తనకు శబరి కనిపించిన చోటూ, జటాయువు రావణుడితో పోరాడిన చోటూ, జనస్థానంలో తాము నివశించిన ఆశ్రమమూ మొదలైనవన్నీ సీతకు చూపాడు.

అయోధ్యకు చేరక ముందే ఎదురు వచ్చి కలుసుకో,'' అన్నాడు.

హనుమంతుడు మానవ రూపం ధరించి వాయు మార్గాన బయలుదేరి, గంగాయమునా సంగమం దాటి శృంగిబేరపురం చేరుకుని, గుహుణ్ణి కలుసుకున్నాడు. గుహుడితో, రాముడు రేపు ఉదయం భరద్వాజాశ్రమం నుంచి బయలుదేరి వస్తున్నాడని చెప్పి, హనుమంతుడు బయలుదేరి, అయోధ్యకు కొంచెం దూరంగా ఉన్న నందిగ్రామానికి చేరుకున్నాడు.

అక్కడ భరతుడొక ఆశ్రమం కల్పించుకుని తపస్విలాగా ఉంటున్నాడు. పధ్నాలుగేళ్ళూ నిండినప్పటికీ రాముడింకా రాలేదే అని విచారిస్తున్నాడు. హనుమంతుడు భరతుణ్ణి కలుసుకుని, ''రాజా, శుభవార్త తెచ్చాను. రాముడు రావణుణ్ణి చంపి, సీతను తిరిగి సంపాదించుకుని, మహాబలులైన మిత్రులతో వస్తున్నాడు. సీతారాముల వెంట లక్ష్మణుడు కూడా వస్తున్నాడు,'' అని చెప్పాడు.

ఈ మాట వినగానే భరతుడు ఆనంద పారవశ్యంతో మూర్ఛపోయాడు. అతను తిరిగి స్పృహ తెలియగానే హనుమంతుణ్ణి కౌగలించుకుని, ''ఈ సంతోష వార్త తెచ్చిన నీవు మనిషివో, దేవతవో నాకు తెలీదు. ఇందుకు నీకు లక్ష గోవులనూ, నూరు ఉత్తమ గ్రామాలనూ, పదహారు మంది అందగత్తెలైన కన్యకలనూ దానంగా ఇస్తాను,'' అన్నాడు.

ఇద్దరూ చాలాసేపు కూర్చుని మాట్లాడుకున్నారు. రామ వనవాస కాలంలో జరిగిన సంగతులన్నిటినీ హనుమంతుడు భరతుడికి చెప్పాడు.



భరతుడు శత్రుఘ్నుడితో ఊరంతా అలంకరింపించమనీ, వాద్యాలు ఏర్పాటు చేయమనీ, రాముడికెదురు వెళ్ళటానికి వేశ్యలను సిద్ధ పరచమనీ అన్నాడు.

నందిగ్రామానికి అయోధ్యకూ మధ్య నున్న మార్గాన్ని చక్కగా చదును చేశారు. అంతటా నీళ్ళూ, పూలూ చల్లారు. రాజమార్గాలు పూల తోరణాలు కట్టి, గంధం చల్లి రంగురంగుల ముగ్గులు పెట్టారు. రాజపరివారమూ స్త్రీ జనమూ రామ దర్శనార్థం గుంపులు గుంపులుగా బయలుదేరారు. వేలాది ఏనుగులనూ, గుర్రాలనూ అలంక



రించారు. వాటి పైన కొందరూ, రథాలెక్కి కొందరూ బయలుదేరారు. కౌసల్యా, కైకేయీ సుమిత్రల వెనకగా దశరథుడి భార్యలందరూ పల్లకీలెక్కి వచ్చారు. వీరందరితో బాటు నగరవాసులందరూ నందిగ్రామం చేరుకు న్నారు.

రాముడింకా రాడేమని భరతుడు ఆరాట పడి, హనుమంతుడు తనతో అబద్ధం చెప్పా డని సంశయించాడు. కాని అంతలోనే పుష్పకం కనబడింది. అది త్వరలోనే ఎగిరి వచ్చి నేలమీద వాలింది. భరతుడు రాముడికి ఎదురు వెళ్ళి నమస్కరించాడు.

వానరవీరులందరూ మానవ రూపాలు ధరించి ఉన్నారు. భరతుడు వారి నందరినీ పరామర్శించాడు. అతను సుగ్రీవుడితో, ''సుగ్రీవా; మేమిదివరకు నలుగురం అన్న దమ్ములం. నీ విప్పుడు మాలో అయిదోవాడి వయావు,'' అన్నాడు. విభీషణుణ్ణి కూడా, అతను చేసిన సహాయానికి మెచ్చుకున్నాడు.

రాముడు కౌసల్యకూ, ఇతర తల్లులకూ, వశిష్ఠుడికీ నమస్కరించాడు. భరతుడు తన వద్ద ఉన్న రామపాదుకలను రాముడి కాళ్ళకు స్వయంగా తగిలించాడు. తరవాత అతను రాముడికి చేతులు మోడ్చి, ''రాజా, నీ రాజ్యాన్ని నీవు తీసుకో. ఈ రాజ్యం తిరిగి నీకు అప్పగించటంతో నా జన్మ ధన్యమ యింది. నీవు వెళ్ళే నాటి కన్న ఇప్పుడు బొక్కసమూ, ధాన్యమూ, సైన్యమూ పదింత లున్నది,'' అన్నాడు.

రాముడు నందిగ్రామం చేరుతూనే పుష్పక విమానాన్ని కుబేరుడి వద్దకు పంపేశాడు.

అందరూ కూర్చున్న మీదట భరతుడు రాముడితో, ''అన్నా, నీవు నా తల్లిని సంతోష పెట్టటానికి రాజ్య త్యాగం చేసి వనవాసం వెళ్ళావు. ఈ రాజ్యాన్ని నా కిచ్చావు. నా వద్ద ఇల్లడగా ఉన్న రాజ్యాన్ని నీవు తిరిగి తీసుకో. దీన్ని నీవు కోరకుండానే తొందరపడి ఎందు కిచ్చేస్తున్నా నంటావేమో, ఈ రాజ్య భారం వహించటానికి నీ కున్న దార్ఢ్యం నాకు లేదు. హంసతో సమంగా కాకి ఎలా ఎగురుతుంది? మన తండ్రి పుత్రకామేష్ఠి చేసి నిన్ను ఎందుకు కన్నాడో ఆ ప్రయోజనం తీరాలంటే నీవీ రాజ్య భారం వహించాలి, మమ్మల్నందరినీ పాలించాలి,'' అన్నాడు.

భరతుడు చెప్పిన మాటలకు రాముడు



సమ్మతించాడు. ముందు భరతుడూ, తరవాత లక్ష్మణుడూ, సుగ్రీవుడూ, విభీషణుడూ మంగళ స్నానాలు చేశారు. రాముడి జుట్టు చిక్కుతీసి సరిచేశారు, శరీరానికి లేపనాలు పూశారు, మాలలు ధరింపజేశారు. పీతాంబరం కట్టించారు. అతను సింహాసనం పైన కూర్చున్నాడు. దశరథుడి భార్యలు సీతను చక్కగా అలంకరించారు. కౌసల్య వానర భార్య లందరికీ అలంకారాలు చేయించింది.

సుమంత్రుడు ఉత్తమాశ్వాలు పూన్చిన రథం తెచ్చాడు. రాముడందులో ఎక్కి కూర్చున్నాడు. రథం అయోధ్య కేసి బయలుదేరింది. సుగ్రీవహనుమంతులు స్నానాలు చేసి, మంచి బట్టలు ధరించి, కుండలాలు ధరించి బయలుదేరారు. సీత సుగ్రీవుడి భార్యలతో కలిసి బయలుదేరింది.

దశరథుడి మంత్రులు వశిష్ఠుడితో సహా ముందుగానే అయోధ్యకు వెళ్ళి పట్టాభిషేకం ఏర్పాట్లు ప్రారంభించారు. తరవాత మంత్రులు రాముడికెదురు వచ్చారు. రాముడెక్కిన రథానికి కట్టిన గుర్రాలు పచ్చనివి. భరతుడు సారథిగా కూర్చున్నాడు. శత్రుఘ్నుడు ఛత్రం పట్టాడు. లక్ష్మణుడు వింజామర పట్టాడు. విభీషణుడు మరొక వింజామర పట్టాడు.

సుగ్రీవుడు శత్రుంజయమనే మదగజాన్ని ఎక్కాడు. రాముడి వెంబడి శంకాలూదారు. భేరీభాంకారాలూ, జనుల కోలాహలమూ మిన్ను ముట్టాయి. రాముడు అయోధ్య ప్రవేశించే సరికి ప్రతి ఇంటి మీదా జెండా



ఎగిరింది. అతను తిన్నగా దశరథుడి ఇంటికి వెళ్ళి, సుగ్రీవుడికి విడిది చూపమని భరతుడితో చెప్పాడు.

సుగ్రీవుడు విడిది చేరుతూనే నాలుగు సువర్ణ కలశాలను నలుగురు వానరోత్తముల కిచ్చి, మర్నాడు తెల్లవారే లోపుగా వాటితో సముద్రజలం తీసుకు రమ్మన్నాడు. వాళ్ళా కలశాలు తీసుకుని ఆకాశ మార్గాన బయలుదేరి వెళ్ళారు. అలా వెళ్ళిన వారు జాంబవంతుడూ, హనుమంతుడూ, వేగదర్శీ, ఋషభుడూనూ.

తరవాత రామపట్టాభిషేకం జరిగింది. సీతారాములను రత్న పీఠం పైన కూర్చుండబెట్టారు. వసిష్ఠుడూ, వామదేవుడూ, జాబాలీ, కాశ్యపుడూ, కాత్యాయనుడూ, సుయజ్ఞుడూ,

రామాయణం క్విజ్ డిసెంబర్ 2009
సరైన సమాధానం: C
విజేతకు అభినందనలు: నరేంద్ర,
గాజువాక, విశాఖపట్నం-530026

B

గౌతముడూ, విజయుడూ అనే ఎనిమిది మంది మహర్షులూ రాముడికి అభిషేకం చేశారు. వారి అనంతరం బ్రాహ్మణులూ, కన్యలూ, మంత్రులూ, పౌరులూ, యోధులూ రాముణ్ణి అభిషేకించారు.

శత్రుఘ్నుడు రాముడికి ఛత్రం పట్టాడు. సుగ్రీవ విభీషణులు వింజామరలు పట్టారు. దేవేంద్రుడు వాయుదేవుడి ద్వారా నూరు కమలాలతో కూడిన బంగారు హారాన్నీ, నవరత్న హారాన్నీ పంపాడు. గురు, జన, పరివార సమేతుడైన రాముడు నిండు సభలో ఉజ్వలంగా ప్రకాశించాడు.

రాముడు బ్రాహ్మణులకు లక్ష గుర్రాలనూ, దూడలు గల లక్ష ఆవులనూ, నూరు ఆబోతులనూ దానం చేశాడు; ముప్పై కోట్ల బంగారు నాణాలనూ, వస్త్రాలనూ, నగలనూ దానం చేశాడు, సుగ్రీవుడి కొక దివ్యమైన కాంచనమాలను బహూకరించాడు. సీత కొక ముత్యాల హారం ఇచ్చాడు. సీత హనుమంతుడికి రెండు బట్టలు పెట్టి, అందమైన నగలిచ్చింది.

రాముడు సీతకు ఒక ముత్యాల హారం ఇచ్చి, ‘‘నీకు ఎక్కువ సంతోషం కలిగించిన వాడికి ఇచ్చెయ్యి,’’ అన్నాడు. సీత దాన్ని హనుమంతుడి కిచ్చింది. హనుమంతుడు దాన్ని వెంటనే మెడలో వేసుకున్నాడు.

రాముడు ఇతర వానర ప్రముఖులకూ, విభీషణుడికీ యథోచితమైన కానుకలిచ్చాడు. పట్టాభిషేకం ముగియగానే రాముడి వద్ద సెలవు తీసుకుని వానరులూ, విభీషణుడూ తిరిగి వెళ్ళిపోయారు.

రాముడు రాజ్య భారం సగం లక్ష్మణుడిపైన ఉంచి, భరతుణ్ణి యువరాజుగా అభిషేకించి కీర్తివంతంగా రాజ్యం చేశాడు. అతను నూరు అశ్వమేధాలు చేశాడు. రాముడి పరిపాలనలో ప్రజలకు ఎలాంటి ఈతి బాధలూ లేవు, అకాల మరణాలు లేవు. రామరాజ్యం అంటే ఆదర్శవంతమైన రాజ్యం అనే అర్థం ఏర్పడింది.

(యుద్ధకాండ సమాప్తం)




Morning ఉదయం காலை Tamil కాలై



# పంచతంత్ర కథలు

## మిత్రభేదం - 3

దమనకం చెప్పిన నక్క కథ విని సింహరాజు పింగళకం, ''కాని మన పరివారమంతా భీతి చెంది అరణ్యం నుండి పారిపోవాలని అను కుంటున్నారు,'' అన్నది.

''స్వామీ, అది వారి తప్పుకాదు. రాజును బట్టే ప్రజలు మీరు ధైర్యం వహించి ఇక్కడే ఉన్నట్లయితే నేను వెళ్ళి, ఆ భయంకరమైన రంకె వేసిన ప్రాణి స్వభావం తెలుసుకుని వస్తాను. ఆ తరవాత తమ చిత్తం'' అన్నది దమనకం.

''వెళ్ళి కనుక్కుని రా. అయితే నీకు అక్క డికి వెళ్ళే ధైర్యం ఉన్నదా? దాని రంకె వింటే నీ పై ప్రాణం పైనే పోవచ్చు'' అని పింగళకం అడిగింది.

''యజమాని ఆనతిస్తే మంచి సేవకుడైన వాడు సంశయిస్తాడా? సముద్రాలలో దూకు తాడు, అగ్నిలో చొరబడతాడు!'' అన్నది దమనకం. ''అయితే వెళ్ళిరా! శుభమస్తు!'' అన్నది పింగళకం. దమనకం సింహానికి నమస్కరించి, రంకె వినిపించిన యమునా నది దిక్కుగా బయలుదేరింది.

పింగళకం ఇలా ఆలోచించింది: 'నేను నా భయాన్ని వీడికి తెలియనివ్వడం పొరపాట యిందా? వీడు వెళ్ళి ఆ భయంకర మృగాన్ని తెచ్చి, మోసంతో నన్ను చంపించడు గద? ఆశ్రయం లభించని సేవకులు ఎంత పని అయినా చేస్తారు. నేను మరెక్కడయినా వేచి ఉంటాను.'

ఇలా అనుకున్నదే తడవుగా పింగళకం అక్కడే ఆత్మరక్షణకు అనువైన చోటు చూసు కుని కుదురుగా కూర్చుని, 'నమ్మిన బలవం తుడు బలహీనుడి చేతిలో కూడా ఓడుతాడు; జాగ్రత్త గల బలహీనుడు బలవంతుడికి కూడా లొంగడు' అనుకున్నది.





Morning ఉదయం সকাল Bengali సకాల్

ఈ లోపల దమనకం వెళ్ళి, రంకెలు పెడుతున్న సంజీవకాన్ని చూసి, అది మామూలు ఎద్దేనని తెలుసుకుని ఆశ్చర్యపోయింది. ఒక మామూలు ఎద్దు రంకె వేస్తే పింగళకానికి గల భయాందోళనలు ఆధారం చేసుకుని దాన్ని తన ఆధీనంలో ఉంచుకోవడం తేలిక అని అనుకుంది.

భృత్యులు తమ యజమానికి క్లిష్ట సమస్యలు కలగాలనుకుంటారు. ఎందుకంటే వాటిని పరిష్కరించే మిష మీద తాము లాభం పొందవచ్చు. ఏ సమస్యలూ లేకుండా సుఖంగా తిని కూర్చునే రాజులకు మంత్రాలోచన చేసే వారితో ఏం పని? సంపూర్ణ ఆరోగ్యవంతుడికి వైద్యులూ, ఔషధాలూ ఎందుకు? ఇలా ఆలోచిస్తూ దమనకం పింగళకం వద్దకు తిరిగి వెళ్ళింది.

పక్కనే పొదలో నక్కిన పింగళకం నక్క రాకను గమనించి బయటకు వచ్చి ''ఏంరా, అబ్బీ? ఆ భయంకర మృగాన్ని చూశావా?'' అని అడిగింది.

''తమ దయవల్ల చూశాను. చూసి ఆ మృగంతో మీ ఘన చరిత్ర గురించి చెప్పి, తమకు జోహార్లు అర్పించమన్నాను. తమరు అనుమతిస్తే, అతన్ని తమ సన్నిధికి తెచ్చి, మీ పాదాక్రాంతుడిని చేస్తాను,'' అన్నది దమనకం.

పింగళకం ఈ మాట విని పరమానందంతో ఉబ్బితబ్బిబ్బయిపోయింది. 'వెళ్ళు, వెంటనే అతగాణ్ణి తీసుకురా!'' అన్నది.

దమనకం సంజీవకం వద్దకు వెళ్ళి, ''ఇలారా, తెంపరి ఎద్దూ, ఇంత అమర్యాదగా, మాకు చిరాకు కలిగిస్తూ ఈ నది ఒడ్డున ఎందుకు రంకెలు పెడుతున్నావో మా రాజు పింగళకం గారు తెలుసుగోరుతున్నారు.'' అన్నది.



‘‘ఎవరు నువ్వు చెప్పే ఈ పింగళకం?’’ అన్నది సంజీవకం దురుసుగా.

‘‘ఏమిటీ? మా రాజు పింగళకాన్నే ఎరగవుగా! చెబితే గడగడలాడిపోతావు. ఆయన ఒక గొప్ప సింహం. వనరాజు, అడవిలోని అన్ని జంతువులూ ఆయన పరివారం, ఆయన పెద్ద మర్రి చెట్టు కింద కొలువు తీరి ఉంటారు. ఈ అరణ్యంలో ఉండే సమస్త ప్రాణులకూ ఆయన యజమాని.’’ అన్నది దమనకం.

ఈ మాటలు విని సంజీవకం భయపడి దమనకంతో ‘‘బాబ్బాబు! నువ్వు మంచి వాడివిలాగున్నావు. నన్ను వారి దగ్గిరికి తీసుకుపోదలిస్తే ముందుగా వారి నుంచి నాకు అభయం ఇప్పించు,’’ అన్నది.

‘‘నీ కోరిక సబబుగానే ఉన్నది. రాజుల చిత్తం అగాధం. ఏ సమయంలో ఎలా వ్యవహరిస్తారో ఎవరికీ తెలీదు. నేను పోయి కనుక్కుని వచ్చేంత వరకు నువ్వు ఇక్కడే ఉండు,’’ అన్నది. తరువాత దమనకం నింపాదిగా పింగళకం వద్దకు పోయి, ‘‘మహారాజా, ఆ జంతువు సామాన్యుడు కాడు. సాక్షాత్తూ పరమశివుడి వాహనమట. శివానుజ్ఞతో ఈ వనంలో మేత మేస్తున్నట్లు చెప్పాడు,’’ అన్నది.

పింగళకం ఈ మాట విని మరింతగా దడుచుకుని ‘‘నాకు ముందే తెలుసురా, అబ్బీ! ఈశ్వరుడి అనుమతి లేకుండా ఈ వనంలో స్వేచ్ఛగా తిరుగుతూ, భయంకరంగా రంకెలు పెట్టజాలరు. ఇంతకూ నువ్వు అతనితో ఏమన్నావు?’’ అన్నది.

‘‘మా రాజు సాక్షాత్తూ పార్వతీదేవి వాహనం. పార్వతీదేవే మా రాజుకు ఈ వనాన్ని ఇచ్చింది. నువ్వు ఇక్కడికి అభ్యాగతిగా వచ్చినవాడివి.

అందుచేత నువ్వు మా రాజును కలుసుకుని, వారితో సంధి చేసుకుని సఖ్యంగా తిను, తాగు, తిరుగు, ఆడు; వారి అనుమతితో జీవించు, అన్నాను. అందుకు అతను ఒప్పు కుని తమ వద్దనుండి అభయం తెమ్మన్నాడు. మీ ఎదుటికి రావడానికి జంకుతున్నాడు. మీరు అభయం ఇస్తారో, ఇయ్యరో అది తమ ఇష్టం,'' అన్నది దమనకం.

ఈ మాటకు పింగళకం మహా సంతోష పడిపోయి, ''భేష్ రా అబ్బీ! భేష్! అతడికి అభయం ఇచ్చాను, భయం వలదని చెప్పి వెళ్లి పిలుచుకు రా'' అన్నది. సంజీవకం రంకెకు హడలిపోయినప్పటికీ సింహరాజు బింకం మాత్రం తగ్గలేదు.

సంజీవకాన్ని తీసుకురావడానికి వెళ్లే టప్పుడు దమనకం హృదయం ఆనందంతో పొంగిపోయింది. ఇన్నాళ్ళకు రాజుకు తనపై కాస్త అనుగ్రహం కలిగింది. రాజానుగ్రహం పాయసం వంటిది: ఆప్తులను కలుసుకో వడం లాంటిది. దొరికిన ఈ అవకాశాన్ని వదు లుకుంటే మూర్ఖుడినే అవుతాను.

దమనకం తనలో తాను ఆలోచిస్తూ సంజీ వకాన్ని చేరుకుని ''మిత్రమా, నువ్వు ఇక భీతి చెందనవసరం లేదు. నీ పట్ల మా రాజు అనుగ్రహం సాధించాను. ఆయన నీకు అభయం ఇచ్చారు. నువ్విక నిశ్చింతగా నా వెంట రావచ్చు. కానీ గుర్తించుకో, నీకు రాజా నుగ్రహం సంపాదించింది నేను. అన్ని వేళలా నువ్వు నా చెప్పుచేతులలో ఉండాలి.

''సంధి కుదిరిన తర్వాత రాజుకు ఆత్మీ యుణ్ణి అని విర్రవీగక, పరిపాలన అంతా నా చేతిమీదుగా జరగనీ, అలా చేస్తే ఇద్దరికీ సుఖం. ఒకడు వేట మృగాన్ని కదిలిస్తాడు, రెండోవాడు దాన్ని కొడతాడు; ఇద్దరూ కలిసి దాన్ని పంచుకుంటారు. అది వేట ధర్మం. అదీగాక, నువ్వు నాకు అసంతృప్తి కలిగిం చావంటే త్వరలోనే నశిస్తావు. రాజభృత్యు లను సంతోషపెట్టని వాళ్ళు వెనకటికి దంతి లుడిలాగా భంగపాటు చెందుతారు.''

''అదెలాగా?'' అని సంజీవకం దమన కాన్ని అడిగింది. దమనకం దంతిలుడి కథ చెప్పనారంభించింది.



# ఫోటో వ్యాఖ్యల పోటీ

ఈ ఫోటోలకు ఒక్కమాటలోగాని, చిన్న వాక్యంలోగాని వ్యాఖ్యలు రాయగలరా? రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.



NARAYANAMURTHY TATA



NARAYANAMURTHY TATA



**Editor, CHANDAMAMA INDIA LTD.,**
B-3, Lunic Industries, Cross Road 'B', MIDC, Andheri (East), Mumbai-400093.

వ్యాఖ్యలను కాంపిటీషన్ పోస్ట్‌కార్డుపైన రాసి ఈ నెల 25వ తేదీలోగా మాకు అందేలా పంపాలి.
పోటీ ఫలితాలు ఏప్రిల్ 2010 సంచికలో ప్రచురిస్తాం. ఉత్తమమైన వ్యాఖ్యకు రూ.100/- బహుమానం.

## అభినందనలు

మల్లిపెద్ది కృష్ణారావు,
తం.పే. నారాయణ,
ఇం.నం.7-18-1 A,
బాయ్స్ హైస్కూల్ రోడ్,
మార్కాపురం, ప్రకాశం జిల్లా,
పిన్‌కోడ్: 523316
ఆంధ్రప్రదేశ్.

ఫోటో వ్యాఖ్యల పోటీ:





ఆనందానికి దూరం!
ఆటకు దగ్గర!!

## చందమామ లోకజ్ఞానం క్విజ్-11 డిసెంబర్ 2009 సమాధానాలు

1. ఏసుక్రీస్తు 2. ధ్రువపు జింక 3. బైబిల్ 4. స్లీఘ్ 5. చార్లెస్ డికెన్స్, 1843
6. మాగీ 7. పాగన్ వింటర్ పోల్‌స్టిస్ ఉత్సవాలకు పోటీగా 8. మార్టిన్ లూథర్

గమనిక: సరైన సమాధానాలు గల ఎంట్రీలు రాలేదు గనక బహుమతులు ఇవ్వలేకపోతున్నాము.



Morning ఉదయం સવાર Gujarati सवार

# వేగ సూత్రం




ఈ నెల సమస్య:

ఓ పరోపకారి తన రాష్ట్రంలోని 13 గ్రామాలు/చిన్న పట్టణాలకు చెందిన నిరక్షరాస్యులకోసం ఓ పాఠశాల నిర్మించాలని అనుకున్నాడు. 1-4 గ్రామాలలో ఒక్కోదానిలో 600 మంది నిరక్షరాస్యులు ఉన్నారు. 5-9 గ్రామాలలో ఒక్కోదానిలో 800 మంది నిరక్షరాస్యులు ఉన్నారు. 10వ గ్రామంలో 371 మంది నిరక్షరాస్యులు ఉండగా, 11-13 గ్రామాలలో ఒక్కోదానిలో 200 మంది నిరక్షరాస్యులు ఉన్నారు. పుస్తకాలు, ఇతర సరఫరాల కొనుగోలు కోసం ప్రతి వ్యక్తిని రూ. 100ల కనీస మొత్తాన్ని చెల్లించవలసిందిగా కోరాడు. ఈ లెక్కన ప్రతి గ్రామం నుంచి సేకరించిన సగటు మొత్తం ఎంత? ఈ సమస్య పరిష్కారానికి దగ్గరి వేగసూత్రం ఏది?

మీ వేగసూత్రాన్ని ఫిబ్రవరి 28వ తేదీ లోగా మాకు రాసి పంపండి. అత్యంత వేగవంతమైన సూత్రానికి బహుమతి రూ. 500. విజేతలు ఒకరికన్నా ఎక్కువ మంది ఉన్నట్టయితే ఒక్కొక్కరికి రూ. 100/- ఇవ్వబడుతుంది.

మీ ఎంట్రీలను పంపవలసిన చిరునామా:

**Editor, CHANDAMAMA INDIA LTD.,**

B-3, Lunic Industries, Cross Road 'B',MIDC, Andheri (East), Mumbai-400093

or e-mail your entries to:contests@chandamama.com

*గమనిక: ఈ సమస్యకు వేగవంతమైన వేదగణిత సూత్రం ఏప్రిల్ 10 సంచికలో ప్రచురించబడుతుంది.*

---

డిసెంబర్ నెల సమస్యకు సరైన సమాధానాలు రానందున బహుమతి ఇవ్వలేకపోతున్నాము.

డిసెంబర్ నెల సమస్యకు సరైన సమాధానం:

*దశ* ***1:*** వాహనం నడిచిన మొత్తం దూరం లెక్కించండి:

842+2000=2842కిలోమీటర్లు.

*దశ* ***2:*** ప్రయాణానికి పట్టిన మొత్తం సమయం: 7 గంటల 47 నిమిషాలు + 6 గంటల 34 నిమిషాలు

మీరు సమయాన్ని గంటలు, నిమిషాలను కూడిక చేసినప్పుడల్లా సమస్యను వేగంగా పరిష్కరించడానికి కింది దశలను అనుసరించండి.

1. గంటలు, నిమిషాల హారాలను తొలగించి సంఖ్యలను 747 మరియు 634గా రాయండి.

2. రెండు సంఖ్యలను కూడండి:

747+634=1381

3. మొత్తం విలువకు సమయం స్థిరరాశి 40ని కూడిక చేయండి.(మీ ఫలితం ఎలా ఉన్నప్పటికీ సమయం స్థిరరాశి ఎప్పటికీ 40గానే ఉంటుంది):

1381+40=1421

కాబట్టి, వాహన గమనానికి తీసుకున్న మొత్తం సమయం 14 గంటల 21 నిమిషాలు

*దశ* ***3:*** వేగం=దూరం/సమయం

2842 కి.మీ/ 14 గంటలు 21 నిమిషాలు

21 నిమిషాలు= 21/60 గంటలు లేదా 0.35 గంటలు

2842/14.35=198 కి.మీ/గంటకు(దాదాపు)



**Morning** ఉదయం শুভ **Assamese** పువా

# యురేకా





## టిక్-టికి

ఈ సైన్స్ బొమ్మను తయారు చేయడం నేర్చుకుందాం!

ఏమేం కావాలి?

- సోడా నీటి సీసా మూత
- చిన్న రబ్బర్ బాండ్
- చొక్కా గుండీ
- 50 సెంటీమీటర్ల పొడవైన మందపాటి దారం

తయారు చేయడం ఎలా?

- చిన్న రబ్బర్ బాండ్‌ను కత్తిరించి, దాన్ని చొక్కా గుండీలో చొప్పించండి. రబ్బర్ బాండ్ రెండు కొసలనూ ముడివెయ్యండి.
- 50 సెంటీమీటర్ల పొడవైన మందపాటి దారం తీసుకోండి. దాని పొడవునా అనేక ముడులు వెయ్యండి. ఒక్కో ముడి మధ్య 2 లేదా 3 సెంటీమీటర్ల దూరం ఉండాలి. దారం ఒక కొసను గుండీ రంధ్రానికి ముడి వెయ్యండి.
- రబ్బర్ బాండ్‌ని సాగదీసి దానిని సోడా సీసా మూతకు చుట్టండి.
- సీసా మూతను మీ ఎడమ చేతితో పట్టి ఉంచండి. మీ కుడి బొటనవేలు, చూపుడువేలితో దారాన్ని నెమ్మదిగా లాగండి. దారం పొడవునా మీ చేతివేళ్ళను తాకించండి. అంతే... టిక్-టికి అంటూ వరుసగా శబ్దాలు వస్తాయి. కీచురాళ్ళ రొదలా ఉంటుందీ శబ్దం.

కాన్సెప్ట్:

ప్రతి ముడి వద్ద, వేళ్ళు నిదానంగా సాగుతాయి. గుండీ మూతను తాకినప్పుడు లోహాన్ని మీటితే వచ్చే శబ్దం వినిపిస్తుంది. దారం పొడవునా చేయి సాగుతుంటుంది కాబట్టి, కీచురాళ్ళ రొద వరుసగా శబ్దాలు వినిపిస్తుంటాయి! ఇదీ విషయం!

*అరవింద గుప్తా(పూణెలోని ఇంటర్-యూనివర్శిటీ సెంటర్ ఫర్ ఆస్ట్రానమీ అండ్ ఆస్ట్రో ఫిజిక్స్ భాగంలో విజిటింగ్ సైంటిస్టుగా పనిచేస్తున్నారు.)*



Morning | ఉదయం | പ്രഭാതം | Malayalam | ప్రభాతం

# చందమామ లోకజ్ఞానం క్విజ్‌-13

(పదహారేళ్ళ లోపు పిల్లలకు)

**Co-sponsored by Infosys FOUNDATION, Bangalore**

అన్నీ సరైన సమాధానాలు రాసిన ఒకరికి బహుమతి **రూ. 250లు.***

*సరైన సమాధానాలు రాసినవారు ఒకరికన్నా ఎక్కువ మంది ఉన్నట్టయితే ఒక్కొక్క విజేతకు **50** రూ.లు బహుమతిగా ఇవ్వబడుతుంది.

మీరు చేయవలసిందేమంటే :

1. సమాధానాలు రాయండి.
2. మీ పేరు, వయసు( 16 ఏళ్ళలోపు ఉండాలి) పిన్ కోడ్‌తో సహా పూర్తి చిరునామా రాయండి.
3. చందాదారు అయితే, ఆ నంబర్ రాయండి.
4. కవరు మీద చందమామ లోకజ్ఞానం క్విజ్‌- **13** అని రాసి, చందమామ పూర్తి చిరునామా రాసి మాకు పంపండి.
5. ఫిబ్రవరి నెలాఖరులోగా మీ ఎంట్రీ మాకు అందాలి.
6. ఏప్రిల్ 2010 సంచికలో ఫలితాలు వెలువడుతాయి.

## భాషా విషయాలు!



1. అంతర్జాతీయ మాతృభాషా దినంగా ఏ తేదీని యునెస్కో ప్రకటించింది?
2. మంగళూరు, గోవా ప్రజలు, ముంబై, కేరళలోని కొన్ని ప్రాంతాల ప్రజలు సర్వసాధారణంగా మాట్లాడే భాష ఏది?
3. బెంగాల్ సోదర భాషగా గుర్తించబడిన భాష ఏది?
4. భారతదేశ అధికార భాష ఏది?
5. బీహార్‌లోని మూడు అధికారిక భాషల పేర్లు చెప్పండి?
6. గురుముఖి లిపిలో రాయబడిన భాష ఏది?
7. మాట్లాడే భాషగా లేనప్పటికీ మతాచారాల కోసం ఉపయోగించబడుతున్న భాష ఏది?





Morning ఉదయం VHWDJ Santali సెట్మా



# లోభివర్తకుడు



ఒకానొక గ్రామ సమీపంలోని ఫలవక్షాలున్న పెద్ద తోటలో, ఒక యోగి పర్ణశాల నిర్మించుకుని నివసిస్తూండేవాడు. ఆయనకు చాలా మంది శిష్యులున్నా, దాదాపు అందరూ ప్రాపంచిక విషయాలపట్లే ఎక్కువ ఆసక్తి చూపేవారు. ఎందుకంటే యోగి శిష్యులందరూ రకరకాల వృత్తులతో నిమగ్నమై ఉంటున్నవారే! అయినా, యోగి వారికి సుఖశాంతులతో జీవించేందుకు అవసరం అయిన సలహాలు ఇస్తూండేవాడు.

ఆయన శిష్యుల్లో ఒక వర్తకుడుండేవాడు. అతడు కరుడుకట్టిన లోభి; పరమ దురాశాపరుడు. ఒకే ఒక నిదర్శనం ఏమిటంటే, లక్షలకొద్దీ ఆస్తి గడించినా, ఒక్కపైసా చేజారిపోవడం జరిగితే, ఆ నష్టం పూడ్చుకోవాలన్న కసితో, ఒక పూట తిండి మానేసేవాడు. మిత్రుల్ని భోజనానికి పిలవడం కానీ, ఏ ధర్మకార్యానికైనా చందా ఇవ్వడం గానీ, అతడేనాడూ చేసి ఎరగడు.

ఎప్పుడూ దిగులుగా, దీర్ఘాలోచనలో ఉన్నవాడిలా కనిపించే వర్తకుణ్ణి, యోగి అప్పుడప్పుడూ, ''నువ్వు నవ్వగా ఎప్పుడూ చూడలేదు. కారణం ఏమిటి?'' అని అడిగేవాడు.

ఆ ప్రశ్నకు వర్తకుడు మరింత దిగులుగా ముఖం పెట్టి, ''స్వామీ, సంతోషంగా నవ్వేందుకేం ఉన్నది గనక! లోకమంతా దుష్టులమయంగదా. నేనెంత శ్రమించినా, అందుకు తగిన ప్రతిఫలం మాత్రం కరువైపోతున్నది.'' అనేవాడు.

యోగి అనేకసార్లు, అతడికి-నువ్వు లేనిపోని భయాలతో కుంగిపోతున్నావని చెప్పిచూశాడు. లోకంలో ఎందరో పేదవాళ్ళున్నారు. వాళ్ళు ఉన్నంతలో తృప్తిపడి కాలం గడిపేస్తున్నారు. జీవితాంతం వారికి కష్టపడి బతకవలసి రావడం తప్పని పరిస్థితుల్లో కూడా వారు సంతృప్తికి దూరం కాకుండా బతకగలుగుతారు. సంపాదన తప్ప మరొక ఆలోచన లేనివారు జీవితం చివర్లో కూడా తృప్తి అనే



Morning ఉదయం प्रात: Sanskrit ప్రాతః




మాటకు అర్థం తెలుసుకోలేరు. నువ్వు కూడా, నీ ధోరణి మార్చుకుంటే సుఖంగా కాలం వెళ్ళబుచ్చగలవు; అని బోధచేశాడు. అయినా, వర్తకుడిలో చిన్న మెత్తు మార్పు రాలేదు.

ఇలా కొంతకాలం గడిచాక యోగి జబ్బు పడ్డాడు. ఒకనాడు ఆయన శిష్యులందరినీ దగ్గరికి పిలిచి, ''త్వరలోనే నేను దేహం చాలించబోతున్నాను. మీరంతా సుఖంగా ఉండాలన్నది, నా దీవెన. మీకు మహిమలు, మహత్తులు ప్రసాదించి మిమ్మల్ని సంతోష పెట్టలేను. కాని ఒకటి మాత్రం గుర్తు పెట్టు కోండి. మీరు ఎల్లవేళలా మీ పనిపట్ల అచం చల విశ్వాసం గలిగి ఉండండి. అది మీకు జీవితంలో సుఖశాంతులు కలిగిస్తుంది. అయితే, ఆఖరుసారిగా, మీ సమస్యల గురించి, నా సలహా ఏదైనా అవసరం అను కుంటే, ఒక్కొక్కరే నా దగ్గరకు రండి,'' అని చెప్పాడు.

యోగి ఆరోగ్యపరిస్థితి శిష్యులకు చాలా ఆందోళన కలిగించింది.

కొంతసేపు తరవాత ఒక్కొక్కరుగా యోగిని దర్శించి, తమను దీవించవలసిందిగా మాత్రం కోరారు.

కట్టకడపట ఆయనను చూడవచ్చిన లోభివర్తకుడు, ''స్వామీ, నేనడిగినది ఏదైనాసరే ఇస్తానని ముందుగా వాగ్దానం చెయ్యండి,'' అని కోరాడు.

యోగి ఇక ప్రశాంతంగా కన్ను మూయాలన్న ఆతృతలో ఉన్నాడు. ఆ కారణం వల్ల, ఆయన వర్తకుణ్ణి త్వరగా పంపివేయాలనుకుని, అతడడిగినదానికి సరే అన్నట్టు తల ఊపాడు.

లోభి వర్తకుడప్పుడు, ''స్వామీ, మీ పాత శిష్యుల్లో ఒకరు, తమకు కొన్ని అద్భుత శక్తులు కలవని చెప్పాడు. మీరు ఇనుమును బంగారంగా మార్చగలరట. నా పట్ల దయ చూపి ఆ శక్తిని నాకు ప్రసాదించండి!'' అన్నాడు.

ఆ కోర్కె విని మరణదశలో ఉన్న యోగి వెలవెలపోయి, ''అయ్యో! అలాంటి శక్తి నాకున్నదనుకుంటున్నావా? కాని ఒకటి గుర్తుంచుకో. ఒకవేళ అలాంటి అద్భుత శక్తిని గనుక నువ్వు సంపాయించగలిగితే, మరింత మనోక్షోభకు గురికాగలవు. కనక, శక్తులను పక్కన బెట్టి నీకు నిజంగా మేలు చేయగల దాని కోసం నన్నడుగు,'' అన్నాడు.



Afternoon మధ్యాహ్నం दोपहर Hindi దోపహర్

''అలా కాదు స్వామీ! ఒకసారి ఆ రహస్యం తెలుసుకున్నాక, లోకంలో నా అంతటి సుఖవంతుడు మరొకడుండడు. మరింత బంగారం, మరింత సుఖం... ఇదే నాకు తెలిసిన జీవిత సత్యం!'' అన్నాడు లోభివర్తకుడు ధీమాగా.

యోగి ఇక అతడికి నీతిబోధ చేసినందువల్ల ఇనుమంత ప్రయోజనం కూడా ఉండదని గ్రహించాడు. తక్షణమే వర్తకుణ్ణి అక్కణ్ణించి పంపివేసేందుకు, ఒక మంత్రం చెప్పి, ''ఎలాంటి ఇనుమునైనా సరే తాకి, ఈ మంత్రాన్ని నూరుసార్లు జపించు. వెంటనే అది బంగారమై పోతుంది,'' అన్నాడు.

ఆ తరవాత కొద్ది సేపటికి యోగి మరణించాడు. ఆయన శిష్యులందరిలో, లోభివర్తకుడొకడే ఎంతో సంతోషంగా కనబడ్డాడు.

ఇది చూసిన ఇతర శిష్యులు, ''యోగి స్వామి, ఇతడికి, దైవదర్శనం సులభసాధ్యం చేసే అపురూపమైన మంత్రాన్నేదో ఉపదేశించి ఉంటాడు. ఇన్నాళ్ళు సేవించినా మనకా అదృష్టం లేకపోయింది. స్వామికి, అతడిపట్ల అంత ఆదరం కలగడానికి, ఏదో బలమైన కారణం ఉండి ఉంటుంది,'' అనుకున్నారు.

వారం రోజుల తరవాత లోభి, తుక్కు ఇనుము కొనుక్కువచ్చేందుకు బజారుకు వెళ్ళాడు. అక్కడి వ్యాపారి దానికి చెప్పిన ధర లోభికి చాలా అధికం అన్న అభిప్రాయం కలిగింది. ధర తగ్గుముఖం పట్టే వరకూ ఆగి చూడడం తెలివైనపని అనుకున్నాడతడు.

ఆ తరవాత వారం, వారం బజారుకు వెళ్ళి దాని ధర విచారించసాగాడు. ధరలో మార్పు ఏమీ లేకపోవడంతో లోభి, ''ఈ తుక్కు





Afternoon మధ్యాహ్నం மதியம் Tamil మదియం

ఇనుము బంగారంగా మారబోతున్నది గనక, ఎక్కువ ధరపెట్టి కొన్నా నష్టం ఏమీ ఉండదు. అయినా, చూస్తూ చూస్తూ ఈ వర్తకుడికి అధిక లాభం ఎందుక్కలిగించాలి? మరి కొంత కాలం వేచి చూస్తే కొంప మునగబోదు," అనుకున్నాడు.

ఈ విధంగా వర్తకుడి నిరీక్షణలో రెండు సంవత్సరాల కాలం గడిచిపోయింది. తెలియని ఏ కారణం వల్లనో తుక్కు ఇనుము ధర హఠాత్తుగా పడి పోయింది.

లోభి వర్తకుడు బజారుకు వెళ్ళి, బండ్ల కొద్దీ తుక్కు ఇనుము కొని దాన్ని ఇంటికి చేర్చాడు. అదంతా బంగారం కాబోతున్నది గనక, దాని రక్షణకు గాను ఇంటి మరమ్మతులు ప్రారంభించాడు.

ఇందుకుగాను చాలామంది తాపీ పనివాళ్ళనూ, మేస్త్రీలనూ నియమించాడు. ఇసుకా, సున్నం, రాళ్ళలాంటి వాటి కొనుగోలు కిందా, పనివాళ్ళకు కూలి రూపంలో, అతడు చాలా ధనం వ్యయం చేశాడు. చివరికి ఇంటిని కోటలాగా మార్చి వేశాడు.

ఆఖరుకు ఒకనాటి రాత్రి లోభి, తాను కొని తెచ్చిన తుక్కు ఇనుము మధ్య కూర్చుని మంత్రోచ్చారణ చేయబోయాడు. కాని, మంత్రం గుర్తురాలేదు. దిగ్భ్రాంతికి గురైన వర్తకుడు మళ్ళీ మళ్ళీ ప్రయత్నించాడు. అయినా ఫలితం లేకపోయింది. అతడు నిరాశతో జుట్టు పీక్కుని, తల గోడకేసి కొట్టుకుంటూ మంత్రం గుర్తు చేసుకునేందుకు ఎంతగానో ప్రయత్నం చేశాడు. కాని, ప్రయోజనం కలగలేదు!

లోభి చేసిన పొరబాటేమంటే ఈ రెండు సంవత్సరాల కాలంలో, తుక్కు ఇనుము ధర తగ్గుదలా, పెరుగుదలలను గురించిన ఎడతెగని ఆలోచనలలో మునిగి తేలుతూ, మంత్రాన్ని పూర్తిగా మరిచిపోయాడు.

ఆ తరవాత కొద్ది రోజులకే అతడికి మతిస్థిమితం తప్పింది. బతికినన్నాళ్ళూ, తుక్కు ఇనుమును కాపలా కాస్తూ కాలం గడిపాడు. సంపదపై పేరాశ ఉన్న దాన్ని కూడా పోగొడుతుందన్న సత్యానికి అతడు చెరగని నిదర్శనంగా నిలిచిపోయాడు. – మనోజ్ దాస్





# 25 ఏళ్ళనాటి చందమామ కథ

## అల్లుడి శక్తి

పూర్వం రామశాస్త్రి అనే పేద బ్రాహ్మణుడికి నలుగురు ఆడపిల్లలు. నలుగురికీ పెళ్ళిళ్ళు చేసి, వారిని అత్తవారిళ్ళకు పంపేటప్పటికి రామశాస్త్రి తలమునకలుగా అప్పులపాలై, అప్పుల వాళ్ళకు మొహం చూపలేకపోయాడు, ఒకరోజు అర్ధరాత్రి వేళ, ఎవరికీ చెప్పకుండా ఇల్లు వదిలి, పట్నానికి బయలుదేరాడు. జీవితంపై ఆశలు వదులుకున్న అతడు అలా ఇల్లువదిలినప్పటికీ, తర్వాత ఏం చేయాలి అనే విషయం అతడికి అర్థం కాలేదు.

చీకటిలో అతను నడిచివెళుతూ, ఒక ఊరి వెలుపల ఒక పెద్దమర్రిచెట్టును చేరుకున్నాడు. ఆ చెట్టుమీద కొన్ని వందల ఏళ్ళుగా ఒక బ్రహ్మరాక్షుడు ఉంటున్నాడు. ఆ సంగతి ఆ సమీపంలో గల గ్రామాల వాళ్ళకు అందరికీ తెలుసు. అందుకని పట్టపగలు కూడా ఎవరూ చెట్టు దాపులకు వెళ్ళరు. పొరపాటున ఎవరైనా అటుగా వెళుతూ బ్రహ్మరాక్షసుడి కంట పడ్డారో, అతడి వేధింపులకు తట్టుకుని బయటపడే వారు చాలా తక్కువ. అందుచేత, కటిక చీకట్లో తాను ఉండే చెట్టు సమీపంగా వెళుతున్న రామశాస్త్రిని చూసి బ్రహ్మరాక్షసుడు ఆశ్చర్యపడి ''ఆగు! ఆగు!'' అని పెద్దగా అరిచాడు.

ఆ కేక వినగానే రామశాస్త్రికి క్షణం పాటు ఒళ్ళు చల్లబడింది. అయినా, ఎంత చెడ్డా స్వతహాగా సమయస్ఫూర్తి, ధైర్యమూ కలవాడు కావున, నలుగురు ఆడపిల్లలకు పెళ్ళిళ్ళు చేసి అన్ని రకాల భయాలకూ రాటుదేలి ఉండటం చేత, తన భయాన్ని క్షణంలో జయించి, ''ఎవరది?'' అని అడిగాడు.

తన భీకర కంఠం వింటూనే రామశాస్త్రి భయంతో మూర్ఛపోయి ఉండవలసింది!





Afternoon మధ్యాహ్నం दुपार Marathi దుపార్



అలా జరగకపోవటం బ్రహ్మరాక్షసుడికి గొప్ప అవమానమయింది. రాక్షసుడి గొంతు వినబడిన తర్వాత కూడా ఓ మానవుడు తిరిగి తననే ప్రశ్నించడమా? ఉక్రోషంతో వాడు చెట్టు మీది నుంచి దభీమని రామశాస్త్రి ముందుకు దూకి, 'నేనెవరో తెలియటం లేదా?'' అని కోపంగా రంకె పెట్టాడు.

బ్రహ్మరాక్షసుడిని నేరుగా చూడగానే రామశాస్త్రి పై ప్రాణాలు పైనే పోయాయి. మొదట్లో బింకంగా ఉన్నప్పటికీ ఆ భారీ కాయుడిని చూశాక ఇక అన్ని ఆశలూ వదిలేసుకున్నాడు. కాని ఇల్లు వదిలిపెట్టిన వాడికి ఇక దేనికీ, ఎవరికీ భయపడనవసరం లేదనిపించి ధైర్యం తెచ్చుకున్నాడు. రామశాస్త్రి వాణ్ణి గుర్తించనట్టు అమాయకంగా మొహం పెట్టి, ''ఎవరు బాబూ నీవు? ఇంత రాత్రివేళ, చీకట్లో, ఇక్కడికి ఎందుకొచ్చావు? పురుగూ పుట్రా ఉంటాయి గద! నీవు చూడబోతే ఎంతో నాజూకుగా ఉన్నావు!'' అన్నాడు నిబ్బరంగా.

తాను నిజంగానే అందరూ అనుకున్నంత భయంకరంగా లేనేమోనని బ్రహ్మరాక్షసుడికి తొలిసారిగా అనుమానం కలిగింది. వాడు రామశాస్త్రి కేసి అనుమానంగా చూస్తూ, ''నా దగ్గర దొంగవేషాలు వేస్తున్నావా? నన్ను చూసి నిజంగా నీవు భయపడటం లేదూ? నేనంటే ఈ ప్రాంతంలో భయపడని వాళ్ళు లేరు. నేను బ్రహ్మరాక్షసుణ్ణి! మూడు వందల ఏళ్ళుగా ఈ చెట్టుమీదే ఉంటున్నాను!'' అన్నాడు.

రామశాస్త్రి రాక్షసుడి కేసి నమ్మలేనట్లుగా చూసి, ''నువ్వు రాక్షసుడివా అసంభవం, నువ్వు నిజంగా బ్రహ్మరాక్షసుడివైతే భయంతో చచ్చి ఉండనూ? నిన్ను చూస్తే, మా అల్లుళ్ళను చూస్తే కలిగే భయంలో నాలుగో వంతు కూడా కలగటం లేదు!'' అన్నాడు.

రాక్షసుడికి చాలా ఆశ్చర్యం వేసింది. వాడు ఒక్కసారి తన ఒంటి కేసి చూసుకున్నాడు. అది చూసి రామశాస్త్రి వాడితో మళ్ళీ ఇలా అన్నాడు.

''కాస్త పొడవు ఉన్నమాట నిజమే గానీ, నీ కళ్ళు చాలా అందంగానూ, సౌమ్యంగానూ ఉన్నాయి. నువ్వు ఎంత కోపంగా చూసినా మా పెద్ద అల్లుడి కళ్ళలో ఉన్న కోపంలో నూరో వంతు కూడా లేదు, నీ కళ్ళలో! పైగా నీ గొంతు ఎంతో మృదువుగా ఉన్నది! నీ అరుపులు మా అల్లుళ్ళ నవ్వుల కన్న వినసొంపుగా ఉన్నాయి!''



| Afternoon | మధ్యాహ్నం | మధ్యాహ్న | Kannada | మధ్యాహ్న |
|---|---|---|---|---|



బ్రహ్మరాక్షసుడు తన ఆశ్చర్యం నుంచి తేరుకుంటూ, ''మానవుల్లో నాకంటే భయంకరులు ఉండటం సంభవమా? ప్రపంచం ఇంతగా మారిపోయిందా? ఈ మూడు వందల సంవత్సరాలలో మానవుల శక్తి అంత పెరిగిందా?'' అనుకుని, సందేహ నివృత్తి కోసం రామశాస్త్రిని, ''ఎందుకయ్యా, అలాగంటావు? నాకు లేని శక్తీ, బలమూ నీ అల్లుళ్ళకి ఎలా వచ్చాయంటావు?'' అని అడిగాడు.

''నీకు అసలు పెళ్ళి అయిందా బాబూ?'' అని అడిగాడు రామశాస్త్రి.

''లేదు. పెళ్ళి అయితే ఏమవుతుంది?'' అన్నాడు బ్రహ్మరాక్షసుడు.

''అయ్యో, అమాయకుడా! పెళ్ళి మంత్రాలకు ఎంత శక్తి ఉంటుందో నీకు తెలియదా? ఆ మంత్రాల ప్రభావంతో మామూలు మనుషులే అల్లుళ్ళు అయిపోయి, అంతులేని శక్తి సంపాదించుకుంటారు. మా అల్లుడు కోపంగా చూస్తే చాలు, నేనూ నా కూతురూ, నా భార్యా ఎక్కడివాళ్ళం అక్కడ నీరుగారిపోతాం.

ఇంక కోపంగా అరిచాడంటే చెప్పావూ? చాపచుట్టగా అందరమూ అతడి కాళ్ళమీద పడిపోతాం. నీ కోపమూ, నీ అరుపులూ అందుకే, నా మీద పనిచేయలేదు!'' అంటూ రామశాస్త్రి బ్రహ్మరాక్షసుడికి బోధ చేస్తున్నట్లుగా చెప్పాడు.

రాక్షసుడు ఆలోచనలో పడ్డాడు. ఈ బ్రాహ్మణుడి మాట నిజమే అయి, పెళ్ళికాగానే మానవులకు అంత శక్తి పెరిగే మాటైతే, తనను చూసి భయపడే వారు లేకుండా పోతారు గనక, తాను కూడా పెళ్ళి చేసుకుని, తన శక్తిని పెంచుకోవాలని వాడు అనుకున్నాడు.

రాక్షసుడి మొహం చూస్తున్న రామశాస్త్రి వాడి ఆలోచనలు గ్రహించి, ''నువ్వు మాత్రం బ్రహ్మచారిగా ఎంతకాలం ఉంటావు? పోనీ పెళ్ళి చేసుకుని, అందరినీ నీ అదుపులోకి తెచ్చుకో!'' అని సలహా ఇచ్చి కదిలాడు.

బ్రహ్మరాక్షసుడికి రామశాస్త్రి సలహా నచ్చింది. వాడు రామశాస్త్రిని వెనక్కు పిలిచి ''ఇదుగో, నాకు పెళ్ళి ఎవరు చేస్తారు? నాకు పిల్లను నువ్వే చూడు!'' అన్నాడు.

''నీ తల దన్నేవాళ్ళు ఇప్పుడు మా మనుషుల్లో చాలా మంది ఉన్నారు. ఎవరన్నా పిల్లను గొప్పవాడికి ఇయ్యాలనుకుంటారు గానీ, నీలాంటి అమాయకుడికి పేదవాడికీ ఇవ్వ



Afternoon మధ్యాహ్నం ଅପରାହ୍ନ Oriya అపరాహ్న

డానికి ముందుకు వస్తారా?'' అన్నాడు రామ శాస్త్రి.

రాక్షసుడు బాగా లోకువైపోయి, రామ శాస్త్రిని బతిమిలాడసాగాడు. రామశాస్త్రి వాడి చేత చాలాసేపు బతిమిలాడించుకుని, ''అది అంత తేలిక కాదయ్యా! డబ్బు ఖర్చు చాలా ఉంటుంది. నువ్వేమో ఉండటానికి కనీసం చిన్న భవనం కూడా లేనివాడివి. నీ ఇల్లు ఈ మఱ్ఱిచెట్టేనంటే చూస్తూ చూస్తూ ఎవరు పిల్లని స్తారు?'' అన్నాడు.

''బాబ్బాబు, అంతమాట అనకు. నాకు కాసింత సాయం చేసిపెట్టు. డబ్బుకోసం వెనకాడకు, పిల్లలను వెతకడానికి అయ్యే ఖర్చూ, నీకు బహుమతి కూడా ఇచ్చే భారం నాది! పెళ్ళి అయ్యాక, ఈ మఱ్ఱిచెట్టు వదిలి, పెద్ద భవనంలోకే పోతాను!'' అని బ్రహ్మరాక్ష సుడు బంగారు కాసులున్న కుండ తెచ్చి రామ శాస్త్రికి ఇచ్చాడు.

రామశాస్త్రి సరేనన్నట్టు తల ఆడించి, ''కాని ఒక షరతు, నేను పిల్లను మాట్లాడేదాకా నువ్వు ఎవ్వరికీ కనబడకు, పెళ్ళికొడుకు కాపురం చెట్టుమీద అని తెలిస్తే వచ్చే సంబంధాలు వెనక్కి పోతాయి. నిన్ను చూసిన జనం నువ్వు బలహీనుడివని ప్రచారం చేసినా ఎవరూ పిల్లనియ్యటానికి రారు! కళ్ళ ముందు ఎంతో మేటి మనుషులుండగా పిల్లను తీసుకు పోయి సాదాసీదా బక్క బ్రహ్మరాక్షసుడికి ఇవ్వటం పరువు తక్కువ పని అంటారు!'' అన్నాడు.

బ్రహ్మరాక్షసుడికి రామశాస్త్రి అన్న మాట నచ్చింది. తాను పెళ్ళి అయ్యేదాకా ఎవరి కంటా పడనని రామశాస్త్రికి వాడు మాట ఇచ్చాడు. వాణ్ణి అటు తరవాత ఆ చెట్టుమీద ఎవరూ చూడలేదు.

ఆ చెట్టుమీద ఒకప్పుడు బ్రహ్మరాక్షసుడు ఉండేవాడని ముసలివాళ్ళు చెబితే పడుచు వాళ్ళు హేళన చేస్తూ ''మీవన్నీ వట్టి మూఢ నమ్మకాలు!'' అనేవాళ్ళు. బ్రహ్మరాక్షసుడు ఇచ్చిన బంగారంతో రామశాస్త్రి తన ఇంటికి తిరిగి వెళ్ళి, అప్పులన్నీ తీర్చి, అల్లుళ్ళ గొంతెమ్మ కోరికలన్నీ తీర్చి, మిగిలిన డబ్బుతో హాయిగా బతికాడు.







# ఉత్తమ గాయకుడు



శిశృంగేరి ప్రాంతాలను ఏలే రాజుకు, తన ఆస్థానంలో కవి పండితులతో పాటు, ఒక గాయకుడు కూడా ఉంటే బావుంటుందన్న అభిప్రాయం కలిగింది. ఆయన మంత్రితో, ఈ సంగతి చెప్పి, గాయకుణ్ణి ఎన్నుకునేందుకు సంగీత పోటీ ఏర్పాటు చేయమన్నాడు.

''మీ ఆలోచన బావున్నది. అయితే, ఆ ఎన్నికలో న్యాయనిర్ణేతలెవరు, మహారాజా?'' అని అడిగాడు మంత్రి.

''మరెవరో ఎందుకు? నేనూ, రాణీ, మీరూ అందరం సంగీత ప్రియులమే గదా. న్యాయ నిర్ణేతలుగా మనం ముగ్గురం ఉందాం. ఇందు కోసం, మరెవరో విద్వాంసులను ఆహ్వానించడం వృథా'' అన్నాడు రాజు.

రాజు సంగీత ప్రియుడే కాని, ఆయనకున్న శాస్త్రీయ జ్ఞానం బహుస్వల్పం. రాణికి మంచి శాస్త్రీయ సంగీత జ్ఞానం ఉన్నది.

రాజాజ్ఞ ప్రకారం, మంత్రి దేశంలోని సంగీత విద్వాంసులనూ, సామాన్య ప్రజలనూ ఆహ్వానించి, ఒక పెద్ద సభలో, విద్వాంసులచేత పాట కచ్చేరి పోటీ ఏర్పాటు చేశాడు.

ఆ పోటీలు మూడు రోజులు సాగినై. ఎంతో గౌరవప్రదమైన ఆస్థాన గాయకుడి స్థానం పొందాలన్న పట్టుదలతో, గాయకులు తమ సంపూర్ణ ప్రజ్ఞాపాటవాలను ప్రదర్శించారు.

రాజు ఆ సంగీత విద్వాంసుల్లో మురళీనాథుడనే వాణ్ణీ, మహారాణి వేణునాథుడనే వాణ్ణీ, మంత్రి సుసంగీతుడనే వాణ్ణీ ఎన్నిక చేశారు. ఈ ముగ్గురిలో ఎవరు ఆస్థాన గాయకుడి పదవికి అర్హుడో తేల్చడం ఇప్పుడు సమస్యగా మారింది.

రాజు తన ఎన్నికను సమర్థిస్తూ, ''మురళీనాథుడు చాలా శ్రావ్యంగా పాడాడు. ఆయన పాడుతూంటే, నేను మైమరిచాను. అంత శ్రావ్యంగా, మీ రిద్దరూ ఎన్నిక చేసిన వాళ్ళు పాడలేకపోయారు,'' అన్నాడు.

అందుకు రాణి, ''మురళీనాథుడేమిటి;



Afternoon మధ్యాహ్నం বিয়লি Assamese బియోలి

సుసంగీతుడు కూడా శ్రావ్యంగానే పాడాడు. కాని వాళ్ళిద్దరికీ సంగీతంలో, లోతైన శాస్త్ర జ్ఞానం లేదు. అది లేనివాడు, నిజమైన విద్వాం సుడనిపించుకోలేడు. అందువల్లనే నేను, వేణునాథుణ్ణి ఎన్నిక చేశాను,'' అన్నది.

అప్పుడు రాజు, మంత్రిని, ''మీరు సుసం గీతుణ్ణి ఎన్నిక చేయడంలో ఉన్న ఆంతర్య మేమిటో చెప్పండి?'' అని అడిగాడు.

''మహారాజా, సంగీతశాస్త్ర జ్ఞానం, శ్రావ్యంగా పాడగల నేర్పూ ఏ గాయకుడికైనా ఉండి తీరవలసిన సలక్షణ గుణాలే. కాద నను. కానీ వేటికయినా ప్రజలందరినీ రంజిం పచేయడమే కీలకం. సుసంగీతుడికి శాస్త్ర జ్ఞానంతోపాటు, శ్రావ్యంగా పాడగల నేర్పు కూడా ఉన్నది. గాయకుడైన వాడు పండి తులనూ, పామరులనూ సమానంగా రంజింపజేయాలి. ఆ సామర్థ్యం సుసంగీతుడికే ఉన్నది. ఇది, నా ఒక్కడి అభిప్రాయమే కాదు; ఈ విషయంలో పండితులూ, పామ రులూ కూడా నాతో ఏకీభవించారు,'' అన్నాడు మంత్రి.

ఆ జవాబుకు రాజూ, రాణీ ఆశ్చర్యపోయి, ''మీ అభిప్రాయంతో సంగీత విద్వాంసులూ, మామూలు సంగీత ప్రియులూ ఏకీభవిం చారా? వాళ్ళ అభిప్రాయాలు ఎప్పుడు సేకరి చారు?'' అని అడిగారు.

ఆ ప్రశ్నకు మంత్రి, ''ఆ ముగ్గురూ సభలో పాడుతున్నప్పుడు, సభికుల ప్రవర్తన ఎలా ఉన్నదో, తమరు గమనించారా?'' అని అడి గాడు.

''మురళీనాథుడి పాటలో, నా మనస్సు లగ్నమైపోయింది. అందువల్ల, నేను పరిస



రాలను గమనించలేదు,'' అన్నాడు రాజు.

''నేను వేణునాథుడి పాట వింటూ, అతడి సంగీతశాస్త్ర పరిజ్ఞానానికి అచ్చెరువు చెందాను. అందువల్ల, నేనూ మహారాజు గారి లాగే, సభికుల ప్రవర్తన గమనించలేదు,'' అన్నది రాణి.

అప్పుడు మహామంత్రి తను పరిశీలించిన విషయాన్ని ఇలా పేర్కొన్నాడు. ''మనం ఎన్నిక చేసి, ఆస్థాన విద్వాంసుడిగా నియమించబోయే గాయకుడు, మన ముగ్గురినే కాక రాజ్యంలోని పండితులను, పామరులను కూడా, తన విద్యతో సంతోషపరచాలి. మహారాజుగారి అభిప్రాయం కూడా, ఇదేననుకుంటాను,'' అన్నాడు మంత్రి.

"అవును, నా అభిప్రాయం అదే," అన్నాడు రాజు. మహారాణి కూడా అంగీకార సూచకంగా తలాడించింది.

''అలా అయితే, ఆ ముగ్గురూ పాడుతున్నప్పుడు సభికుల ప్రవర్తన ఎలా ఉన్నదో వివరిస్తాను, చిత్తగించండి! మురళీనాథుడు పాడుతూండగా, పండితులొక్కక్కరే సభ విడిచి వెళ్ళిపోయారు. కాని, సామాన్య ప్రజలు మాత్రం ఆనందంతో తల లూపుతూ చివరివరకూ కూర్చున్నారు.''

''ఇక వేణునాథుడు పాడుతూ ఉంటే సామాన్య ప్రజలు జట్లు జట్లుగా లేచి వెళ్ళారు. పండితులు మాత్రం తుది వరకూ ఆసక్తితో కూర్చున్నారు. సుసంగీతుడు పాడినప్పుడు మాత్రం; అటు పండితులూ, సామాన్య ప్రజలూ కూడా హర్షధ్వానాలు చేస్తూ, కచ్చేరి ముగిసేవరకూ ఉండిపోయారు. నిస్సందేహంగా ప్రజామోదం సుసంగీతుడి వైపే మొగ్గిందని నా అభిప్రాయం. ఆ కారణం వల్లనే, నేను ఆ ముగ్గురిలో సుసంగీతుడు ఆస్థాన గాయక పదవికి అర్హుడని ఎన్నిక చేశాను,'' అన్నాడు మంత్రి.

హేతుబద్ధతకు పట్టంగట్టిన మంత్రి అభిప్రాయంతో ఏకీభవించి, రాజూ, రాణీ సుసంగీతుణ్ణి ఆస్థాన గాయకుడుగా నియమించారు.

– కోలార్ కృష్ణ అయ్యర్

డిసెంబర్ 2009 'తగిన వారసుడు' కథ
రచన: జె. మార్కండేయులు





Afternoon మధ్యాహ్నం ᱛᱟᱨᱥᱤᱧ Santali తారసింజ్



# సాహస యువకుడు



విజయేంద్రుడనే రాజు, సింధునదీ ప్రాంతంలోని మహేంద్రపురి అనే రాజ్యాన్ని పాలిస్తూండేవాడు. ఆ సమయంలో, ఉత్తర ప్రాంతానవున్న పర్వతారణ్యాల నుంచి హూణులనే అనాగరిక జాతులు, మహేంద్రపురి రాజ్యం మీద దాడులు చేస్తుండేవి.

విజయేంద్రుడు తన రాజ్యంలోని యువకుల్లో, ధైర్యసాహసాలేకాక, రాజ్య రక్షణకు ప్రాణత్యాగమైనా చేయడానికి సిద్ధపడిన వాళ్ళను, ముందుగా ప్రధానమంత్రి చేత పరీక్షింపజేసి సైన్యంలో చేర్చుకుంటూండేవాడు.

ఒకనాడు ఇరవై ఏళ్ళ యువకుడొకడు, రాజదర్శనానికంటూ వచ్చాడు. కాపలా భటులు అతడి వింతవాలకం చూసి నవ్వుకుంటూ, ''మహారాజుతో ఏంపని?'' అని అడిగారు. కాపలావాళ్ళు ఎందుకు నవ్వుకుంటున్నారో గ్రహించినయువకుడు కోపంగా, ''నా ఎడమవైపు మీసంకన్న కుడివైపు మీసం పొట్టిగా వుండడం చూసేగదా మీరు నవ్వుకుంటున్నది. దాని వెనక మహాసాహసవంతమైన కథ ఒకటున్నది!'' అన్నాడు. ఆ జవాబుకు, కాపలావాళ్ళు మరింత పెద్దగా నవ్వి, ''ఏమిటా కథ?'' అని అడిగారు.

యువకుడు నడుంనుంచి వేలాడుతున్న కత్తి పిడిపై చేయివేసి, ''ఆ కథ ప్రతి అడ్డమైన కాపలాశునకానికీ వినిపించేదికాదు. అది వినడానికి మహారాజుగారూ లేక మంత్రిగారూ మాత్రమే అర్హులు! ముందు నాకు దారి ఇస్తారా లేదా?'' అంటూ కత్తిదూశాడు.

ఇది చూసి నివ్వెర పోయిన కాపలా భటులు, వాళ్ళల్లో ఒకణ్ణి సంగతి చెప్పేందుకు మంత్రి దగ్గరకు పంపారు.

మంత్రి వాడు చెప్పింది విని ఆశ్చర్యపోతూ, ఆ యువకుణ్ణి పంపమన్నాడు.

మంత్రి సభాభవన ద్వారం ముందు ఆ యువకుడికి ఎదురుపడ్డాడు. యువకుడు, ఆయనకేసి నిర్భయంగా చూస్తూ, ''తమరు మంత్రిగారేనా, అవునా?'' అన్నాడు.

''అవును, మహామంత్రినే! ఇంతకూ నీ పేరేమిటి? వచ్చినపనేమిటి?'' అని అడిగాడు.



Afternoon మధ్యాహ్నం मध्याह्नः Sanskrit మధ్యాహ్నః

ఆ వెంటనే యువకుడు, ఆయనకు తల వంచి నమస్కరించి, ''మహామంత్రివర్యా! నా పేరు నృసింహవర్మ. మహారాజుగారు, మన రాజ్యం మీద దాడి చేసే హూణుల ఆగడాలు కట్టించేందుకు సైన్యంలో ధైర్యసాహసాలు గల యువకులను చేర్చుకుంటున్నారని తెలియవచ్చింది. అందుకోసం వచ్చాను,'' అన్నాడు.

''అంటే, సైనికయోధుడుగా హూణులతో యుద్ధం చేయదలచావన్న మాట, బావుంది! ఐతే, నీ మీసం వాలకం చూస్తే, ఎంతటి శత్రువూ కత్తిదూయడానికి జంకుతాడు,'' అంటూ మంత్రి చిరునవ్వు నవ్వాడు.

''మహామంత్రివర్యా! మీసం అలావుండానికి కారణం ఏమిటో పెద్దకథవుంది!'' అన్నాడు నృసింహవర్మ. ''అలాగా! ఆ కథేమిటో సంగ్రహంగా చెప్పు,'' అన్నాడు మంత్రి.

నృసింహవర్మ ఒక సారి గొంతు సవరించుకుని, ''నాలోవున్న దేశభక్తికారణంగా, అన్నిటికీ తెగించి, హూణుల నాయకుడుండే శిబిరానికి వెళ్ళాను. వాడు పులి చర్మంతో తయారైన ఆసనం మీద భల్లూక చర్మం కప్పుకుని కూర్చునివున్నాడు. భటులు నన్ను చూసి ప్రశ్నించే ముందే, నేనా హూణుల నాయకుణ్ణి – ఒరే, నిన్ను చూసినవాళ్ళకెవరికైనా, నువ్వు శునకానివా లేక నక్కవా అన్న అనుమానం కలుగుతుంది. మారాజ్యం మీద మిడతల దండులా వాలి దోచుకు తింటున్నావు. నిన్ను.., అని నేను మాట ముగించేలోపలే, వాడు తన భటులను, 'ఒరే, వీడి పీక నరకండి!' అని ఆజ్ఞాపించాడు. ఆ వెంటనే ఒక భటుడు కత్తిని, నా కంఠం కేసి విసిరాడు. అది గురితప్పి నా కుడి మీసాన్ని సగం ఖండించి, కింద పడిపోయింది. ఆ మరుక్షణం నేను వాళ్ళకు చిక్కకుండా పారిపోయాను,'' అన్నాడు.

''ఆహా, ఇదంతా ఎప్పుడు జరిగింది?'' అన్నాడు మంత్రి.

''ఎప్పుడోనా, ఒక పావుగంట ముందు,'' అన్నాడు నృసింహవర్మ తొణక్కుండా.

మంత్రి పొట్ట చెక్కలయ్యేలా నవ్వి, ''ప్రస్తుతం రాజుగారికి కావలసింది, ఆస్థాన విదూషకుడు! నా వెంట రా, రాజదర్శనం చేయిస్తాను,'' అంటూ నృసింహవర్మను వెంటబెట్టుకుపోయాడు. – డి. శంభుదాసు





Evening సాయంత్రం शाम Hindi షామ్

# భారత దర్శిని

## తాబేలుకో గుడి



మహావిష్ణువు రెండో అవతారమైన తాబేలుకు అంకితం చేస్తూ నిర్మించిన కూర్మనాథ స్వామి దేవాలయం ఆంధ్రప్రదేశ్‌కి చెందిన ఉత్తరాంధ్రలోని శ్రీకాకుళం పట్టణ సమీపంలో ఉంది. ఈ ఆలయాన్ని పరమ పవిత్రమైనదిగా భక్తులు భావిస్తుంటారు. ఎందుకంటే కూర్మావతారంలో ఉన్న మహావిష్ణువు ఆలయం దేశం మొత్తంలో ఇదొక్కటే మరి. గర్భగుడిలో పెద్ద తాబేలు ఉంటుంది.

ఈ మందిరం సమీపంలోకి వచ్చిన అతి పెద్ద తాబేలు శిలాజమే ఇక్కడ దేవతగా ఉంటోందని నమ్మకం. ఒరియా ఆలయ శిల్పరీతిలో ఈ గుడిని నిర్మించారు.

## కవలల గ్రామం

కేరళలోని కొడింజి గ్రామం 204 జతలకు పైగా కవలపిల్లలకు నిలయంగా ఉంది. దాదాపు రెండు వేల కుటుంబాలతో ఉన్న ఈ గ్రామ సమాజంలో ఇంతమంది కవలలు ఎందుకు ఉంటున్నారనే విషయం వైద్యులను ఆశ్చర్యపరుస్తోంది.

కొడింగి గ్రామంలో ఉంటున్న మహిళలే కాకుండా, పెళ్ళి చేసుకుని, ఇక్కడి నుంచి దూర ప్రాంతాలకు వెళ్ళిన మహిళలు కూడా కవలపిల్లలను కంటున్నారు. ఇది ఆ ప్రాంతంలోని నీటి మహత్యమేనని కొంతమంది స్థానికులు అంటున్నారు. వర్షరుతువులో భారీ వర్షాల వల్ల కొడంగి చుట్టు పక్కల పొలాలన్నీ జలమయమైపోయి రాకపోకలు కూడా స్తంభించిపోతాయట. దీనితో ముడిపడిన విశ్వాసానికి శాస్త్రీయ ప్రాతిపదిక ఏదీ లేదు మరి!






Evening సాయంత్రం மாலை Tamil మాలై



# మన చరిత్ర పుటల నుంచి

## చిటికెడు ఉప్పు

మే నెల 20, 1930, బల్సార్, బాంబే ప్రెసిడెన్సీ.
''కానీ నేను అక్కడికి తప్పకుండా వెళ్ళాలి!'' ఆ పొడవాటి అమెరికన్ దాదాపు అభ్యర్థిస్తున్నట్టుగా చెప్పాడు. ''మీరు అక్కడికి వెళ్ళలేరని ఇప్పటికే మీకు సమాచారమిచ్చినట్లుగా భావిస్తున్నాను.'' బ్రిటిష్ అధికారి నోటి నుంచి మాటలు సూటిగా, స్పష్టంగా వచ్చాయి. ఆ అమెరికన్ ముఖంలో అసంతృప్తిని సరదాగా చూస్తూ అతడు రైల్వే అధికారి డెస్క్ వెనుక సర్దుకుని కూర్చున్నాడు.

''బాబ్బాబూ... ఏమైనా సరే నేను అక్కడికి వెళ్ళితీరాలి! నేనొక పత్రికా రచయితను... ప్రపంచం ఇలాంటి దాన్ని ఎన్నడూ చూసి ఎరుగదు...''

''అది ఒక సర్కస్ మాత్రమే, మీకు వినబడలేదా?'' ఆ బ్రిటిష్ ఉద్యోగి ఉన్నట్లుండి స్వరాన్ని పెంచాడు. ''చాలా మంది ప్రజలు తమను కాపాడడానికి ఉద్దేశించిన ప్రతి చట్టాన్ని ఉల్లంఘిస్తున్నారు. దాన్ని ధర్మోల్లంఘన అనే నేను పిలుస్తాను!''

''దీనిపై ప్రపంచమే తీర్పు చెప్పవలసి ఉంది. దాన్ని ప్రపంచానికి చూపించాలని నా ఉద్దేశ్యం.''

''నేనలా భావించడం లేదు మిత్రమా, నీకు సంబంధించని దాంట్లో నువ్వు వేలుపెట్టకపోతేనే మంచిదనుకుంటున్నా'' ఆ పోలీసు అధికారి అతడికేసి తేరిపారచూశాడు. ''సరే మంచిది. కనీసం నన్ను బొంబాయికయినా వెనుదిరిగి వెళ్ళనివ్వండి. నా వసతి వ్యవహారాలు చూసుకోవాలి.''



''భేషుగ్గా వెళ్ళండి. రైలు సిద్ధంగా ఉంది. నిజానికి మీరు వెళ్ళిపోవడం నేను స్వయంగా చూడాలి కూడా.'' అధికారి నవ్వుకుంటూ వేగంగా కదిలిపోతూండగా ఆ విలేఖరి పిడికిళ్ళు బిగించి కూర్చున్నాడు. పొగలు కక్కుతూ రైలు బయలుదేరింది. బల్సార్ స్టేషన్‌ను రైలు దాటిపోయిందో లేదో, ఆ అమెరికన్ ఒక్కసారిగా దాంట్లోంచి దూకేశాడు. ప్రయాణీకులు దిగ్భ్రాంతితో ఆశ్చర్యం ప్రకటిస్తున్నా తాను మాత్రం పట్టించుకోలేదు.



Evening సాయంత్రం সন্ধ্যা Bengali సంధ్యా

“డింగ్రీ?” రైలు పట్టాల మీద నిలబడి ఉన్న వ్యక్తిని పలకరించాడు. “డింగ్రీ వైపు పోవడానికి రైలు ఉందా?” వచ్చీ రాని హిందీలో అడిగాడు. ఆ వ్యక్తి తల అడ్డంగా ఊపాడు. “దయచేసి



చెప్పవా.. నేను అక్కడికి పోయి తీరాలి?” నిండా సరకులతో కదలడానికి సిద్ధంగా ఉన్న ఓ పాత గూడ్స్ రైలుకేసి ఆ వ్యక్తి చేయి చాపాడు. అమెరికన్ దానివైపు ఎగాదిగా చూసి అప్పటికప్పుడు ఓ నిర్ణయానికి వచ్చేసి మురికిగా ఉన్న ఓ పెట్టెలోకి ఎక్కేశాడు. దుస్సాహసం చేసినందుకు మిల్లర్‌ను తిట్టని వారు లేరు మరి.

***

డింగ్రీని తన గమ్యస్థానంగా అతడు తీసుకున్న నిర్ణయం న్యాయబద్ధమైనదే. అది ధరసన ప్రాంతానికి దగ్గరి స్టేషన్. సర్వశక్తులూ ఒడ్డి అతడు అక్కడకు రావడానికి ఓ కారణముంది.

యుక్తవయసులో ఉన్నప్పటికీ, వెబ్ మిల్లర్‌కు తన జీవితాన్ని ఎలా గడపాలనే విషయంలో ఎలాంటి సందేహాలూ లేవు. అతడు ప్రపంచాన్ని చుట్టి రావాలనుకున్నాడు. సుదూర ప్రాంతాలలో జరుగుతున్న ప్రతి ముఖ్యమైన ఘటనపైనా రాయాలని అతడు అనుకున్నాడు. తాను విన్నదీ, చూసిందీ, ప్రపంచమంతా చూడగలిగే విధంగా రాయాలని అతడి కోరిక.

ఇప్పుడతడు భారత్‌లోనే ఉన్నాడు. భారతీయులు సత్యాగ్రహం అని పిలుస్తున్న దానిని ఆచరణలోనే చూడాలని అతడు ఆత్రుతపడుతున్నాడు. మొదట్లో అతడు దానిని సరిగా ఉచ్చరించలేకపోయాడు కూడా. ఈ ఆలోచన మొట్టమొదటిగా ఎంకె గాంధీ అని పిలువబడే వ్యక్తికి వచ్చింది. మొదట్లో ఆ పదం ఎంత వింతగా కనిపించిందంటే, ఆ పేరు వినగానే అందరూ పగలబడి నవ్వడం మొదలెట్టేవారు.

అహింసా పోరాటం లేదా ఉప్పు చట్టాలకు వ్యతిరేకంగా నిలబడటం అనేదాన్ని ప్రభుత్వానికి వ్యతిరేకంగా నిఖార్సయిన ఆయుధంగా ఎక్కుపెట్టవచ్చనే విషయంపై మిల్లర్‌కు అంత నమ్మకం లేదు. మనం సులభంగా పోరాటం చేయగల స్థితిలో ఉన్నప్పుడు చావుదెబ్బలు తినటానికి ఎవరయినా ఎందుకు సమ్మతిస్తారు? తిరగబడటం ప్రతి మనిషికి సహజంగా ఉండే ప్రతిస్పందనే కదా.

అయితే ఇది నిజంగా అసంబద్ధమైన ఆలోచనే అయితే, పలువురు భారతీయులు దానికి అనుకూలంగా ఎందుకు ఉంటున్నారు? భారతీయ నేతలు కూడా దాన్నే ఎందుకు చేపడుతున్నారు? పైగా, భూమ్మీద ఈ గాంధీ అనబడే వ్యక్తి ఎవరు?

***

మే నెల 21, 1930, ధరశన, బాంబే ప్రెసిడెన్సీ.



వెబ్ మిల్లర్ అత్యంత కష్టకాలాన్ని ఎదుర్కొం టున్నాడు. అయితే తన లక్ష్యాన్ని మధ్యలోనే వదిలి పెట్టకుండా ప్రయత్నిస్తున్నాడు. డింగ్రీ నుంచి దరశనకు 6 మైళ్ళు నడిచి వచ్చాడు. గాంధీజీ అరెస్టుకు నిరసనగా శాంతియుత ప్రదర్శన చేయడానికి గుజరాత్ వ్యాప్తంగా 2,500 మంది స్వచ్ఛంద కార్యకర్తలు అక్కడికి వచ్చారు. ఉప్పు కయ్యలపై దాడులు కూడా ఏకకాలంలో చోటు చేసుకున్నాయి. గాంధీజీ అక్కడ లేరు. కాని అతడు అక్కడ ఉన్నట్లుగానే ఉంది. ఆ ప్రదర్శన ముందు నిలబడి కవయిత్రీ, రాజకీయనేత సరోజినీ నాయుడు ఉద్వేగంతో చేసిన ప్రసంగం మిల్లర్‌కు ఇప్పటికీ గుర్తుంది.

''గాంధీజీ శరీరం మాత్రమే జైలులో ఉంది. అయితే ఆయన ఆత్మ మీ వద్దే ఉంది'' అంటూ ఆమె జనసమూహానికి చెప్పింది.'' భారతదేశ ప్రతిష్ట మీ చేతుల్లో ఉంది: ఏ పరిస్థితుల్లోనూ మీరు హింసకు పాల్పడవద్దు. మిమ్మల్ని చితక బాదవచ్చు, కానీ మీరు ప్రతిఘటించవద్దు: దెబ్బలను కాచుకోవడానికి మీరు కనీసం చేయి కూడా పైకి చాపవద్దు.''

ఆమె ప్రసంగానికి జనం హర్షధ్వానాలు చేశారు. తరవాత నెమ్మదిగా, నిశ్శబ్దంగా వారు అరమైలు దూరంలో ఉన్న ఉప్పు కయ్యలవద్దకు ఊరేగింపుగా వెళ్ళారు. గాంధీజీ రెండవ కుమారుడు మనిలాల్ ప్రదర్శనకారులకు ముందు నిలబడి నడుస్తున్నాడు. వారంతా ''ఇంక్విలాబ్ జిందాబాద్!'' అంటూ పదే పదే నినాదాలు చేస్తూ ఉన్నారు. మిల్లర్‌కు ఒంటిపై రోమాలు నిక్కపొడుచుకున్నట్లయింది.

ఉప్పు కయ్యలను కాపలా కాస్తున్న పోలీసులు ఉక్కు కవచంతో ఉన్న అయిదడుగుల ఎత్తు లాఠీలు ధరించి ఉన్నారు. మరో ఇరవై అయిదు మంది సైనికులు ఆయుధాలు ధరించి కాల్పులు ప్రారంభించడానికి వేచి ఉన్నారు.

ఉప్పు కయ్యలకు వంద గజాల దూరంలో ఈ గాంధీ మనుషులను నిలిపివేశారు. గుంపు నుంచి ఓ వరుస జనం ముందుకు కదిలి కంచె వైపుకు సాగింది. సూరత్ పోలీసులు లాఠీలతో సిద్ధంగా ఉన్నారు. హెచ్చరిక కాల్పులు చేసినప్పటికీ గుంపు ముందుకు కొనసాగింది. డజన్ల కొద్దీ పోలీసు అధికారులు ముందుకు కదులుతున్న జనం తలలపై లాఠీలతో బాదసాగారు. అయితే ఏ ఒక్కరూ ఆత్మరక్షణార్థం చేతులు అడ్డుపెట్టలేదు.

చాలా మంది దెబ్బల ధాటికి స్పృహ తప్పి పడిపోయారు లేదా



నొప్పితో మూలగసాగారు. ఆ మైదానం మనుషుల దేహాలతో నిండిపోయింది. వారి తెల్లబట్టల నుంచి రక్తం స్రవించింది. అల్లంత దూరంలో వేచి ఉన్న ఓ సమూహం నిశ్శబ్దంగా అక్కడికి వచ్చి కిందపడిన మనుషులను మోసుకు వెళుతుంటే, మరి కొందరు ప్రదర్శకులు ఆ మైదానంలోకి అడుగు పెట్టారు.

ఇలా ప్రదర్శనకారులు వరుసలు వరుసలుగా ముందుకు రావటం, లాఠీదెబ్బల ధాటికి స్పృహతప్పి నేలమీద పడిపోవటం, వారిని అక్కడి నుంచి తొలగించడం కొనసాగింది. ఎటుచూసినా రక్తం, సగం ప్రాణాలు కోల్పోయిన వారే కనిపిస్తున్నారు. అయితే ఈ హింసాకాండకు నిరసనగా ఒక్కరంటే ఒక్కరు కూడా స్వరం విప్పలేదు. దెబ్బలు తాళలేక నొప్పితో మూలుగుతున్న వారు కూడా నిరసన తెలుపలేదు.

మిల్లర్ దిగ్భ్రాంతి చెందాడు. ''ఇంత అద్భుతమైన స్వయం క్రమశిక్షణ లేదా ఆత్మత్యాగ స్ఫూర్తిని నేను ఇదివరకెన్నడూ చూడలేదు'' మిల్లర్ తన వార్తాపత్రికకు పంపిన నివేదికలో రాశాడు. ''గాంధీ ఆత్మ ఈ నిరసనకారులను ఆవహించింది. తన ఉపదేశాలను ఆయన వారి మనస్సులలోకి చొప్పించాడు.''

తన కార్యాలయంతో మాట్లాడటం ముగించిన తరవాత అతడు నిట్టూర్చి, బాంబే పోస్టాఫీసు నుంచి బయటపడ్డాడు. సంచిలో స్టాంపులను పెట్టుకుని ఉన్న ఓ వృద్ధుడి వద్ద నుంచి స్టాంపులు కొని డబ్బు చెల్లించాడు. ఆ వృద్ధుడు నవ్వి చెప్పాడు. ''అయ్యా! కృతజ్ఞతలు.''

''అలా చెప్పనవసరం లేదు. మీ ప్రజలు చూపిన స్ఫూర్తితో పోలిస్తే ఇది లెక్కలోకి కూడా రాదు'' చెప్పాడు మిల్లర్.



''ఓ.. మీరు అహింసోద్యమం గురించి మాట్లాడుతున్నారు.''

''కనీసం పోలీసులయినా తమ ప్రవర్తనకు సిగ్గుపడాల్సి ఉండె. రక్తపాతాన్ని ఆపడానికి ఇంత కంటే సమర్థవంతమైన మార్గాన్ని నేను చూసినట్లు లేదనుకుంటున్నా.'' మిల్లర్ నిట్టూర్చాడు.

''కానీ గాంధీని ఒక్కసారి కూడా నేరుగా కలవలేకపోయినందుకు చాలా బాధగా ఉంది.'' ఆ వృద్ధుడు చిరునవ్వు నవ్వాడు. ''మీరు ఏం చూశారో ప్రపంచానికి తెలియజేయండి మిస్టర్ మిల్లర్. అణచివేతకు వ్యతిరేకంగా అహింస ఒక్కటే సత్యం. మాలాంటి వారికి మీరు ఆశలు కల్పించాలి.'' మిల్లర్ నవ్వాడు. ''నేను మన స్ఫూర్తిగా ఆ పని చేస్తాను. ఇంకా మీ లాంటి వారిని చాలా మందిని కలవాలని భావిస్తున్నా. అయితే మీ పేరు నాకు తెలీదు మిస్టర్..?''

''గాంధీ,'' ఆ వృద్ధుడు నవ్వాడు. 'మోహన్ దాస్ కరంచంద్ గాంధీ.''

– పవిత్రా శ్రీనివాస్



Evening సాయంత్రం ସନ୍ଧ୍ୟା Oriya సంధ్యా



# మన దేశభాషలు నేర్చుకుందాం

ఈ జాబితాలో మొదట మీకు తెలిసిన భాషలలోని పదాలను చదవండి. ఆ తరవాత వాటి కింద ఇచ్చిన పదాలను అనుసరించి ఆయా భాషలలో ఆ పదాల ఉచ్చారణలనూ, అర్థాలనూ నేర్చుకోడానికి ప్రయత్నించండి.

    

| English | Happy Birthday | Morning | Afternoon | Evening | Night |
|---|---|---|---|---|---|
| Telugu | జన్మదిన శుభాకాంక్షలు | ఉదయం | మధ్యాహ్నం | సాయంత్రం | రాత్రి |
| Hindi | जन्मदिन की शुभकामनाएँ<br>జన్మదిన్ కీ శుభ్‌కామ్‌నాయేం | सुबह<br>సుబహ్ | दोपहर<br>దోపహర్ | शाम<br>షామ్ | रात<br>రాత్ |
| Tamil | பிறந்தநாள் வாழ்த்துகள்<br>పిరందనాళ్ వాళ్తుకళ్ | காலை<br>కాలై | மதியம்<br>మదియమ్ | மாலை<br>మాలై | இரவு<br>ఇరవు |
| Bengali | শুভ জন্মদিন<br>శుభ జన్మదిన్ | সকাল<br>సకాల్ | বিকেল<br>బికెల్ | সন্ধ্যা<br>సంధ్యా | রাত<br>రాత్ |
| Marathi | शुभ जन्मदिवस<br>శుభ జన్మదివస్ | सकाळ<br>సకాళ్ | दुपार<br>దుపార్ | संध्याकाळ<br>సంధ్యాకాళ్ | रात्र<br>రాత్ర్ |
| Kannada | ಹುಟ್ಟಿದ ಹಬ್ಬದ ಶುಭಾಶಯಗಳು<br>హుట్టిద హబ్బద శుభాశయగళు | ಪ್ರಾತಃಕಾಲ<br>ప్రాతఃకాల | ಮಧ್ಯಾಹ್ನ<br>మధ్యాహ్న | ಸಾಯಂಕಾಲ<br>సాయంకాల | ರಾತ್ರಿ<br>రాత్రి |
| Oriya | ଶୁଭ ଜନ୍ମଦିନ<br>శుభ జన్మదిన | ସକାଳ<br>సకాల | ଅପରାହ୍ନ<br>అపరాహ్ణ | ସନ୍ଧ୍ୟା<br>సంధ్యా | ରାତ୍ରି<br>రాత్రి |
| Gujarati | શુભ જન્મદિવસ<br>శుభ్ జన్మదివస్ | સવાર<br>సవార్ | બપોર<br>బాపోర్ | સાંજ<br>సాంజ్ | રાત<br>రాత్ |
| Assamese | শুভ জন্মদিন<br>హుబ జన్మదిన్ | পুৱা<br>పువా | বিয়লি<br>బియోలి | সন্ধ্যা<br>హంధ్యా | ৰাতি<br>రాతి |
| Malayalam | ജന്മദിനാശംസകൾ<br>జన్మదినాశంసగల్ | പ്രഭാതം<br>ప్రభాతం | ഉച്ചക്ക്<br>ఉచ్చాక్కు | വൈകിട്ട്<br>వ్యకిట్టు | രാത്രി<br>రాత్రి |
| Santali | ᱥᱟᱜᱩᱱ ᱡᱟᱱᱟᱢ ᱢᱟᱦᱟ<br>సాగున్ జానామ్ మాహా | ᱥᱮᱛᱟᱜ<br>సెట్టా | ᱛᱟᱨᱥᱤᱧ<br>తారసింజ్ | ᱟᱭᱩᱵ<br>ఐయూబ్ | ᱱᱤᱫᱟ<br>నిండా |
| Sanskrit | जन्मदिनस्य शुभाशयाः<br>జన్మదినస్య శుభాశయాః | प्रातः<br>ప్రాతః | मध्याह्नः<br>మధ్యాహ్నః | सायङ्कालः<br>సాయంకాలః | रात्रिः<br>రాత్రిః |



కింది బ్రాకెట్లలో సూచించిన భాషను పరిశీలించండి. వాక్యాన్ని పూరించడానికి ఆ భాషలోంచి తగిన పదాన్ని రాయండి.

1. బాలిక పుట్టినరోజున తరగతిలోని వారు ___________ తెలిపారు.(ఒరియా)
2. ఉపాహారాన్ని ______ వేళ తింటారు.(అస్సామీ)
3. సూర్యాస్తమయం ___________ లో జరుగుతుంది.(మరాఠీ)

Evening సాయంత్రం સાંજ Gujarati సాంజ్

    

| English | Welcome | Goodbye | Congratulations | How are you | I am fine |
|---|---|---|---|---|---|
| Telugu | స్వాగతం | వీడ్కోలు | అభినందనలు | బాగున్నారా | బాగున్నాను |
| Hindi | स्वागत<br>స్వాగత్ | राम राम<br>రామ్ రామ్ | बधाइयाँ<br>బధాయియాఁ | तुम कैसे हो<br>తుమ్ కైసే హో | मैं अच्छा/अच्छी हूँ<br>మైఁ అచ్ఛా/అచ్ఛీ హూఁ |
| Tamil | நல்வரவு<br>నల్వరవు | போய் வருகிறேன்<br>పోయ్ వరుకిరేన్ | வாழ்த்துகள்<br>వాళ్‌త్తుకళ్ | எப்படி இருக்கிறாய்<br>ఎప్పడి ఇరుకిరాయ్ | நன்றாக இருக்கிறேன்<br>నన్‌రాగ ఇరుక్కిరేన్ |
| Bengali | স্বাগতম<br>స్వాగతమ్ | বিদায়<br>బిదాయా | অভিনন্দন<br>అభినన్‌దన్ | কেমন আছ<br>కెమోన్ ఆచో | আমি ভাল<br>ఆమి భాలో |
| Marathi | स्वागत<br>స్వాగత్ | बराय, येतो<br>బరాయ్, యేతో | अभिनंदन<br>అభినందన్ | कसे आहात<br>కసే ఆహాత్ | मी ठीक आहे<br>మీ ఠీక్ ఆహే |
| Kannada | ಸುಸ್ವಾಗತ<br>సుస్వాగత | ಶುಭಮಸ್ತು<br>శుభమస్తు | ಅಭಿನಂದನೆಗಳು<br>అభినందనగళు | ಸೌಖ್ಯವಾಗಿದ್ದೀರಾ<br>సౌఖ్యవాగిద్దరా | ಸೌಖ್ಯವಾಗಿದ್ದೇನೆ<br>సౌఖ్యవాగిద్దేనే |
| Oriya | ସ୍ୱାଗତଂ<br>స్వాగతమ్ | ବିଦାୟ<br>బిద్యా | ଶୁଭେଚ୍ଛା<br>సుభేచ్ఛా | ତୁମେ କିପରି ଅଛ<br>తుమ్ కిపారీఅచ్చా | ମୁଁ ଭଲ ଅଛି<br>ము బాలా అచ్చాయ్ |
| Gujarati | આવો<br>ఆవో | આવજો<br>ఆవజో | અભિનંદન<br>అభినందన్ | તમે કેમ છો<br>తమే కేమ్ చో | હું સારી છું<br>హం సారీ చూం |
| Assamese | স্বাগতম<br>స్వాగతమ్ | বিদায়<br>బిదాయ్ | অভিনন্দন<br>అభినన్‌దన్ | কি খবৰ<br>కి ఖబర్ | মোৰ ভালেই<br>మోర్ బాలేఈ |
| Malayalam | സ്വാഗതം<br>స్వాగతమ్ | വിട<br>విదా | അഭിനന്ദനങ്ങൾ<br>అభినందనగళ్ | സുഖമാണോ<br>సుఖమానో | എനിക്ക് സുഖം തന്നെ<br>ఎనిక్కు సుఖం దానే |
| Santali | [illegible]<br>అటాంగ్ డారామ్ | [illegible]<br>బిడా | [illegible]<br>సార్హా | [illegible]<br>చెద్ లేకా మినేమా | [illegible]<br>నాపాయ్ గియాన్జి |
| Sanskrit | स्वागतम्<br>స్వాగతమ్ | शुभं भवतु<br>శుభం భవతు | अभिनन्दनानि<br>అభినన్‌దనాని | कथम् अस्ति भवान्<br>కథమ్ అస్తి బవాన్ | अहं कुशली<br>అహం కుశలీ |

4. వేసవికాలంలో ___________ చాలా వేడిగా ఉంటుంది.(కన్నడ)
5. చంద్రుడు ______ వేళ ఉదయిస్తాడు.(గుజరాతీ)
6. అతిథులకు అతిథేయి _________ చెప్పారు.(తమిళం)
7. దినేష్ తన పర్యటన మొదలు పెట్టడానికి ముందు ___________ చెప్పాడు.(సంతాలీ)
8. రాజుకు కొత్త ఉద్యోగం వచ్చిన సందర్భంగా స్నేహితులు అతడికి ___________ తెలిపారు.(మలయాళం)
9. డాక్టర్ రోగిని ___________ అని అడిగాడు.(హిందీ)
10. నేను ___________ అని రోగి చెప్పాడు.(బెంగాలీ)





Evening సాయంత్రం সন্ধ্যা Assamese హంధ్యా

# పాతాళదుర్గం - 19



[సూర్యోదయం కాగానే, మాంత్రికుడి అనుచరులు పాతాళదుర్గం మీదికి ఓషధీభస్మాలు ప్రయోగించారు. రాక్షసులు దాని ప్రభావం వల్లా, తాగినమైకంలోనూ కవ్వించుకుని, తన్నుకోసాగారు. మహాకలి ఏనుగుల రథం మీద అక్కడికి వచ్చాడు. విరూపుడు వదిలిన నల్లగరుడపక్షి, బంగారు మొసలిపిల్లతో పాతాళదుర్గం మీద ఎగరసాగింది. - తరవాత]

రాక్షసులు నల్ల గరుడపక్షిని చూసి అద్భుతం చెంది ప్రాణాచారాలు పడటం గమనించిన మహాకలి, ఏనుగల రథం ఆపి తల ఎత్తి పైకి చూశాడు. అతడి దృష్టిని గరుడపక్షి కాలిన వేలాడుతున్న మొసలిపిల్ల ఆకర్షించింది. పక్షిలో విశేషం ఏమీలేదు. అలాంటి వాటిని అతడు లోగడ తూర్పు వైపు కొండ ప్రాంతాల్లో చూసి వున్నాడు. కాని, బంగారంలా మిల మిలా మెరిసిపోతున్న మొసలిపిల్ల పక్షి కాలిన వేళ్ళాడు తుండటం ఏమిటి? బంగారు మొసళ్ళు ఎక్కడైనా ఉంటవా?

తమ రాజు వాలకం గమనించిన ఒక ముసలిరాక్షసుడు, ''మహాకలి! ఆ పక్షి నీ తండ్రి అయిన ఘోరకలి అని మనవాళ్ళు భక్తితో దణ్ణాలు పెడుతున్నారు. నీవూ అలా చేయటం బావుంటుంది. లేకపోతే, తండ్రి అంటే భక్తిగౌరవాల్లేని కొడుకుగా వాళ్ళు నిన్ను దూషిస్తారు,'' అని సలహా ఇచ్చాడు.

''గరుడపక్షి నా తండ్రి ఎలా అవుతుంది? ఇందులో ఏదో మోసం ఉన్నది. వారం రోజులుగా దుర్గం చుట్టూ ఉన్న కొండల మీద మానవాధము లెవరో తచ్చాడుతున్నట్టు ఇంతకు ముందే నాకు వార్త తెలిసింది,'' అన్నాడు మహాకలి కోపంగా.

Evening సాయంత్రం വൈകിട്ട് Malayalam వైకిట్టు

మహాకలి అన్న మాటల్ని ముసలి రాక్షసుడు అందరికీ వినబడేలా ఎత్తయిన రాతి బండ మీద నిలబడి, పెద్ద గొంతుతో చెప్ప సాగాడు: ''అది కొండ శిఖరాల మీద బతికే గుడ్డి గరుడపక్షి, మహాసత్వుడైన ఘోర కలేశ్వరుడు కాదు. ఈ మాట మన దుర్గేంద్రుడు మహాకలి చెపుతున్నాడు.''

ఈ మాటలు విన్న రాక్షసుల్లో కొందరు గరుడపక్షి కేసి రాళ్ళు గురిచేశారు, మరి కొందరు, ముసలివాడు తమ రాజును అవమానిస్తున్నాడన్న కోపంలో అతడి మీదికి చేతికందిన ఆయుధాలను విసరసాగారు. మహాకలి తన అంగరక్షకు లందర్నీ కేకవేసి, వాళ్ళతో సంప్రతింపులు ప్రారంభించాడు.



పైన కొండమీది చెట్లచాటున నిలబడి ఇదంతా చూస్తున్న కాలశంబర మాంత్రికుడు తృప్తిగా ఓ సారి నవ్వి, ''సరోవరంలో ఉన్న బండరాయిని మనవాళ్ళు ఈపాటికి బయిటికిలాగి ఉంటారు. గుహల్లో ఉన్న మనవాళ్ళంతా ఇంకా కొండమీదికి వచ్చినట్టు లేదే? జై, శాంభవీ! వేగిరం, వేగిరం!'' అంటూ మంత్రదండాన్ని పైకెత్తి గిరికీలు కొట్టసాగాడు.

అంతలో భూకంపం కలిగినట్టుగా కొండ దద్దరిల్లిపోయింది. పాతాళదుర్గం వైపున ఉన్న కొండపాదంలో రెండుమూడు చోట్ల నీరు తాటిచెట్టు ప్రమాణంలో పైకి లేచి, చెవులు చిల్లులు పడేలా ధ్వనిస్తూ దుర్గం ముందున్న మైదానం మీద ధారాపాతంగా పడసాగింది.

''జలప్రళయం! జలప్రళయం!'' అంటూ కొందరు రాక్షసులు భయంతో కంపించిపోతూ కేకలు పెట్టారు. ముసలి రాక్షసుడు గొంతు మరింత పెద్దది చేసి, ''తనను అవమానించినందుకు ఘోర కలేశ్వరుడు మనందరినీ శిక్షిస్తున్నాడు. దీనికి బాధ్యతంతా మహాకలిదే!'' అని అరిచాడు.

సరోవరంలోని బండరాయిని మోకుల సాయంతో బయటికి లాగిన మాంత్రికుడి అనుచరులు–భద్రుడూ మొదలైన వాళ్ళు పరుగున అతడి దగ్గిరకు వచ్చారు. భద్రుడు ఎంతో ఉత్సాహంగా, ''మహా మాంత్రికా! మనం జయించాం. ఇంత కాలంగా నువ్వు రహస్యంగా దాచి ఉంచిన బండరాయిని బయటికి గుంజగానే, సరోవరం అంతా ఒక్కసారి అల్లకల్లోలమై, భూకంపం వచ్చినట్టుగా కొండ గజగజలాడి పోయింది,'' అన్నాడు.



Evening సాయంత్రం ᱥᱤᱛᱩᱢ Santali ఐయూబ్




‘‘అది భూకంపమా? కాదు, కాదు మహా ప్రళయం! నేను రోజుల తరబడి జలస్తంభనం చేసి, సరోవరం అడుగు నుంచి కొండ లోని సొరంగాల్లోకి దారులు ఏర్పరిచి, కావాలన్నప్పుడు సరోవర జలమంతా పాతాళ దుర్గాన్ని ముంచెత్తేందుకు వీలుగా ఆ రాయిని అక్కడ తాపడం చేశాను. ఆ రాయికి స్థాన భ్రష్టత్వం కలిగితే, పాతాళదుర్గం నీట మునుగుతుంది. కాని, రాక్షసుల్లో కొందరైనా ఈ లోపల దుర్గాన్నుంచి అరణ్యంలోకి ఉన్న కొండదారి వెంట పారిపోయే అవకాశం ఉన్నది. ఆ దుర్మార్గుల్లో ఒక్కగా నొక్కడైనా అలా ప్రాణాలతో బయటపడకుండా ఉండేందుకే, ఇంత కాలం వేచివుండి, ఇన్ని ఏర్పాట్లు చేయవలసి వచ్చింది,’’ అంటూ కాలశంబరుడు, చెవులకు అరచేతులడ్డం పెట్టుకుని కొంచెం సేపు విని, ‘‘ఏమిటా అరుపులు? మీకు వినబడటం లేదా?’’ అని పక్క నున్న వాళ్ళను ప్రశ్నించాడు.

‘‘ఎక్కడో దూరంగా పులులూ, సింహాలూ రెచ్చిపోయి మొరుగుతున్నట్టుగా ఉన్నది,’’ అన్నాడు విరూపుడు. ‘‘మొరగటమా?’’ అంటూ మాంత్రికుడు చిరునవ్వు నవ్వి, ‘‘అవి కుంభీరుడి పెంపుడు జంతువులు. ఒకటి రెండు రోజులుగా వాటికి ఆహారం పెట్టకుండా మాడ్చాడు. ఇప్పుడవి పాతాళదుర్గం నుంచి అరణ్యంలోకి పోయేందుకున్న ఒకే ఒక సన్నని కొండమార్గాన్ని కాపాడేందుకు వస్తున్నవి. ఆ దారి వెంట మహాకలి తన అనుచరులతో బయటికి పారిపోలేడు. సాహసించి మన వైపుగా ఉన్న కొండ ఎక్కదలిస్తే మనం వాళ్ళను హతమారుస్తాం. ఆ క్రూరులందరూ నీట మునిగి చావవలిసిందే,’’ అన్నాడు.

‘‘శశికాంతుణ్ణీ, కాంతిసేననూ వెంట తీసుకుని సరోవరంకేసి బయలుదేరిన కుంభీరుడేమయ్యాడో తెలియటం లేదు,’’ అన్నాడు భద్రుడు. ‘‘నా మిత్రుడూ శత్రువూ కూడా అయిన పులిందుడి పడుచుపెళ్ళాం భామాసింగి కూడా వాళ్ళ వెంట ఉన్నదని చెప్పావు. ఆ గయ్యాళి అందర్నీ తప్పుదారి పట్టించి ఉండదు గదా?’’ అన్నాడు విరూపుడు.

‘‘మాకన్నిటికన్న రాజకుమారి ముఖ్యం. ఆమెను తెచ్చి రాణిగా చేస్తామని మా కదంబ ప్రజలందరికీ మాట ఇచ్చి వచ్చాం.’’ అన్నాడు ధూమకుడు. సోమకుడు అవునన్నట్లు తలా డించి, విల్లంబుల్ని చేతికి తీసుకున్నాడు.



Evening సాయంత్రం सायङ्काल: Sanskrit సాయంకాలహ

కాలశంబర మాంత్రికుడు అసంతృప్తితో తల పక్కకు తిప్పుకుని, ''ఇప్పుడు ఎవరి ప్రయోజనం వాళ్ళు చూసుకోవటం ప్రారంభిస్తే మొదటికే ముప్పు వస్తుంది. నా తండ్రిని క్రూరాతిక్రూరంగా తల నరికి చంపిన మహాకలి రాక్షసుణ్ణి హతమార్చితే నా పగ తీరినట్టే! కాని, అంతమాత్రాన కలగబోయే మేలేముంటుంది? వాడి అనుచరుల్లో మరొకడు పాతాళ దుర్గాన్ని ఆశ్రయంగా పెట్టుకుని, మహాకలిని మించిన ఘోర కార్యాలు చేయవచ్చు. కనక, ముందీ రాక్షసాధము లందర్నీ యమపురికి పంపితే, ఆ తరవాత రాజకుమారి కాంతిసేనా, మంత్రికొడుకు శశికాంతుడూ అందరి రక్షణా చూడవచ్చు,'' అన్నాడు.

ఇంతలో కింద పాతాళదుర్గం వైపు నుంచి భయంకరమైన ధ్వని వినబడింది. మాంత్రికుడూ అతడి అనుచరులూ ముందుకు పరిగెత్తి కిందికి చూశారు. పాతాళదుర్గంలోని ఒక భాగం నీటి తాకిడికి పునాదులతో కూడా కదిలి నీట పడిపోయింది. అప్పటి వరకూ దాని మీద నిలబడి ఉన్న రాక్షసులు హాహాకారాలు చేస్తూ నీళ్ళల్లో పడి ఈదుతూ, రొప్పుతూ రోజుతూ మాంత్రికుడున్న కొండ వైపుకు ఈదుకు రావటం కనబడింది.

కాలశంబరుడు మంత్రదండం పైకెత్తి, ''భద్రా! ధూమకా! నా మాట వినండి. శశికాంతుడూ, రాకుమారి క్షేమంగా ఉన్నారని నమ్మండి,'' అంటూ మంత్రదండాన్ని వాళ్ళ ముందుకు చాచి, ''ఇదుగో, ఆ చెట్టు కింద కనబడుతున్నారు గదా? ఆ పక్కన ఉన్నవాడు కుంభీరుడు!'' అంటూ వాళ్ళు అటు వైపు దృష్టి తిప్పక ముందే మంత్రదండాన్ని పైకెత్తి పట్టుకుని, ''భద్రా! చెట్లకొమ్మల్లో దాచి ఉంచిన రాకాసి వడిశెలలను, రాక్షసుల మీద ప్రయో





Night రాత్రి रात Hindi రాత్



గించటానికి ఇదే మంచి అదను. గురి చూసి, వాళ్ళ మీదికి రాతి గుండ్లను విసరండి,'' అని చెప్పాడు. ఆ సరికే చెట్ల మీద ఉన్న వడిశెలల వాళ్ళు, పెద్ద పెద్ద రాతిగుండ్లను వాటిల్లో పెట్టి రాక్షసుల మీద ప్రయోగించటానికి సిద్ధపడి, ఆజ్ఞల కోసం ఎదురుచూస్తున్నారు.

భద్రుడు వాళ్ళను సమీపించి, ''ఇక రాళ్ళవర్షం కురిపించండి. దెబ్బ కొక రాక్షసుడు పరలోకానికి ప్రయాణం కట్టాలి,'' అని హెచ్చరించి, తన వెంట ఉన్న వాళ్ళతో, ''మీరు మోయగలిగినంత పెద్ద రాళ్ళను వడిశెలల వాళ్ళ దగ్గరకు తీసుకుపొండి,'' అని ఆజ్ఞాపించాడు. ఒక్క క్షణం తరవాత మహా వృక్షాల కొమ్మల నున్న వడిశెలల నుంచి పెద్ద పెద్ద రాళ్ళు జుయ్ అని శబ్దం చేస్తూ, నీట ఈదుతున్న రాక్షసుల శరీరాలను తాక సాగినై. దెబ్బ తగలగానే ఒక్కొక్క రాక్షసుడూ పెద్ద చావుకేక పెట్టి నీట మునిగి గిలగిలా తన్నుకుంటూ పైకి తేలసాగాడు.

ఆ సరికి పాతాళదుర్గంలో ఎక్కువ భాగాన్ని సరోవర జలం ఆక్రమించింది. దుర్గం తాలూకు కొన్ని శిఖరాలు మాత్రమే నీటి మీద తేలి ఉన్నవి. కొందరు రాక్షసులు ఆ శిఖరాలను ఆసరాగా పట్టుకుని వేళ్ళాడుతున్నారు. కింద పొంగులు వారుతున్న నీటిని చూసిన బంగారు మొసలి పిల్ల అందులో దూకేందుకు గిజగిజ తన్నుకోసాగింది. ఆ కారణం వల్ల నల్ల గరుడపక్షి ఎంత బలంగా రెక్క లాడించినా ఎత్తుకు పోలేక, వరద నీటికి నాలుగైదు గజాల ఎత్తున ఎగరసాగింది.

''ఘోరకలేంద్రుడు మనను రక్షించేందుకు వస్తున్నాడు!'' అంటూ పాతాళదుర్గం శిఖరం పట్టుకు వేళ్ళాడుతున్న ఒక రాక్షసుడు కేక వేశాడు. ఆ వెంటనే చాలా మంది రాక్షసులు, ''రక్షించు, ఘోర కలేంద్రా, రక్షించు!'' అంటూ హాహాకారాలు ప్రారంభించారు.

కాలశంబర మాంత్రికుడు పొట్ట చెక్కలయేలా నవ్వుతూ, ''విరూపా! నీ నల్ల గరుడుడు నువ్వన్నట్టు నిజంగా దేవతాపక్షే. దాని సాయంతో మనం రాక్షసుల్ని బాగా మోసగించగలిగాం. కాని, మహాకలి ఏమైనట్టు? వాడు జలగండం నుంచి తప్పించుకు పోలేదు గదా?'' అన్నాడు, అదుర్దా కనబరుస్తూ.

అందరూ పరవళ్ళు తీస్తున్న నీటి కేసి పరీక్షగా చూశారు. హఠాత్తుగా రెండు ఏనుగులు పాతాళదుర్గ శిఖరం వెనక నుంచి



| Night | రాత్రి | इरवु | Tamil | ఇరవు |
|---|---|---|---|---|

ముందుకు వచ్చినై. వాటిలో ఒక దాని మీద మహాకలి ఉన్నాడు, రెండవ దాని మీద అతడి అంగరక్షకు లిద్దరు కూర్చుని ఉన్నారు. అందరి దుస్తులూ నీళ్ళోడుతున్నవి. మహా కలి తన చేతిలోని గదను పైకెత్తి, ''ఆ దిక్కు మాలిన పక్షి, నా తండ్రి అనుకుని ప్రాణా చారాలు పడి, నెత్తిమీదికొస్తున్న ప్రమాదాన్ని గుర్తించక చిక్కుల్లో పడ్డాం. ఇప్పుడు విచా రించి లాభం లేదు. అందరూ అరణ్యంలోకి పోయే కొండ సొరంగం కేసి ఈదుకురండి. కొండ మీదికి చేరాలని ప్రయత్నించే వాళ్ళను, ఆ దుష్ట మాంత్రిక వెధవ కాలశంబరు డెలా రాళ్ళు విసిరి చంపిస్తున్నాడో కనబడటం లేదా?'' అంటూ పెద్దగా అరవసాగాడు.

మహాకలి అంగరక్షకు లిద్దరూ తాము ఎక్కి ఉన్న ఏనుగును చక్రాకారంలో వరద నీట తిప్పుతూ, రాక్షసులను శూలాలతో పొడిచి మహాకలి చెప్పిన కొండ సొరంగం కేసి మళ్ళవేయసాగారు. మహాకలి అటుకేసి ఏనుగును నడుపుతూ, ''తొందరగా రండి! సొరంగం దాటి ఒకసారి నేల తాకామో, ఆ మాంత్రికుడు చచ్చిన వాడికిందే లెక్క. నా కాబొయ్యే పెళ్ళాం కాంతి సేన ఎక్కడ? బలిపెట్టవలసిన ఆ చచ్చు వెధవ శశికాంతు డేమయ్యాడు?- పిశాచి భామాసింగి నీట కలిసిందా? ఆ అన్నటు కుంభీరా! కుంభీరా!'' అంటూ కేకలు పెట్టసాగాడు.

''మహాకలిగాడికి మతిపోయింది! సంధి మంత్రాని కిదా సమయం? సరే, అందరూ కొండ సొరంగం కేసి నడవండి. అక్కడ కుంభీరుడు వన్యమృగాలతో ద్వార రక్షణ చేస్తూ ఉంటాడు. అయినా, రాక్షసులకు సింహాలతో పోట్లాడటం ఏపాటి? మనం కాట్ల కుక్కలతో కలియబడ్డంత తేలిక,'' అంటూ కాలశంబరుడు వేగంగా బయలుదేరాడు.

రాక్షసులందరూ తమ రాజు వెనకగా ఈదుతూ సొరంగ మార్గం కేసి రాసాగారు. మాంత్రికుడు తన అనుచరులతో కొండ రాళ్ళు ఎక్కి దిగుతూ, సాధ్యమైన చోట కొండ అంచుల వెంట పాకుతూ, వాళ్ళకన్న కొంచెం ముందుగా సొరంగ మార్గం చేరాడు. అతడికి అరణ్యం వైపుకు ఉన్న సొరంగద్వారం ముందు కుంభీరుడూ, అతడి వంశం వాళ్ళూ కనిపించారు. (వచ్చే సంచికలో ముగింపు)





Night రాత్రి রাত Bengali రాత్

# రహస్యాలు : త్యాగం

[ అంతరించిపోయిన ప్రాణుల భూమి అనునిర్వలో మరణం అనేది లేదని డోడోలు శివకు వివరిస్తాయి. అతడు చూసిన ప్రాణి రూపాలు భ్రమ మాత్రమే. అవి మారతాయి, పరివర్తన చెందుతాయి. అవి మరణించవు. శివ నిద్రపట్టని రాత్రి గడిపిన తర్వాత, చీనా ఏనుగు వచ్చి లేపుతుంది. యుద్ధమండలి వద్దకు అతడిని తీసుకునిపోవడానికి అది వచ్చింది. -తరవాత]

ఈ రోజు చాలా ప్రత్యేక దినం. చీనా ఏనుగు నన్ను నీటి గుంట వద్దకు తీసుకుపోయింది. నీరు చల్లగా ఉండి నా శరీరానికి హాయి గొలుపుతోంది. నా ముఖాన్ని శుభ్రపర్చుకుని, కాస్త అందంగా కనబడేలా తీర్చిదిద్దుకున్నాను. నా చేతిని నీటిలో ముంచి, నా మనస్సును ఊహలకు వదిలేశాను... ఆకాశం నుండి సూర్చుడు భూమ్మీద నా జీవితం చివరి రోజుపై తీర్పు ప్రకటిస్తున్న దేవుడిలా ప్రజ్వరిల్లుతున్నాడు, తాతయ్యను ఎలాంటి చిక్కుల్లో పెట్టకుండా బుద్ధిగా మసలుకోమని మా నాన్న నాకు చెబుతున్నాడు: రైల్లో డోడోలు... వాటితో నేను మాట్లాడకుండా ఉండినట్లయితే పరిణామాలు చాలా తీవ్రంగా ఉండేవని నేననుకున్నాను. తాతయ్య భవంతిలోకి నీరు దూసుకొస్తోంది, నాగరికతల ధూళి, కోల్పోయిన అద్భుత సంపదల లోహ వర్ణాలు, శతాబ్దాల పాపాలతో సముద్రం వాసనేస్తోంది... సముద్రానికి అన్నీ తెలుసు. మన బాకీ తీర్చుకోవడానికి అది వచ్చింది. దాని పాప పరిహారాలు. నా చేతిలో నీరు శ్వాసిస్తున్నట్లుగా అనుభూతి చెందాను. అది సజీవంగా ఉంది. నేను ఇక్కడ ఉన్నట్లు దానికి తెలుసు. నా చేతిని ఓ గోరు పట్టి ఉంచింది. నా కళ్ళను తెరవలేకపోతున్నాను. అదేంటో నేను చూడలేకపోతున్నాను.



అది నన్ను నీటిలోనికి లాగింది. అల్లంత దూరంలో చీనా ఏనుగు ఆనందంగా ఘీంకరిస్తోంది. ఏం జరుగుతోందో దానికి తెలియకుండా ఉండాలి లేదా ఇదొక అనూహ్యమైన నాటకీయ ప్రదర్శనగా భావించి తన అనుమతిని ఘీంకారం రూపంలో తెలుపుతుండవచ్చు. నా భుజాన్ని ఏదో తడుతోంది... నా కళ్ళను



| Night | రాత్రి | रात्र | Marathi | రాత్ర్ |
|---|---|---|---|---|

తెరువవలసిందిగా ఏదో నన్ను కోరుతోంది... నా సహజ స్వభావానికి వ్యతిరేకంగా ఘర్షణపడుతూ, నేను కళ్ళు తెరిచి చూశాను. అదుగో మా తాతయ్య!! అతడి పక్కన వందలాది మంది జలమానవులు తేలియాడుతున్నారు. నారింజ పచ్చ కళ్ళతో వారు నాకేసి కన్నార్పకుండా చూస్తున్నారు. సుతారంగా పట్టుకున్న జలకన్య చేతుల్లో లడ్డూ చిక్కివున్నాడు. ఆమె జుత్తును అతడు నములుతున్నాడు. అయితే ఆమె దాన్ని స్ఫూర్తితో తీసుకుంటోందని నేను భావించాను.

నాతో ఏదో చెప్పాలని తాతయ్య ప్రయత్నిస్తున్నాడు. తన చేతిలో రబ్బరు తొడుగును చూశాను. తను చెబుతున్న దాన్ని అర్థం చేసుకోవడానికి నేనూ ఒకదాన్ని ధరించవలసి వచ్చింది. ఆయన నుంచి దాన్ని తీసుకుని నా తల చుట్టూ కప్పుకున్నాను. నేను బాగానే ఊపిరి పీల్చుకోగలను.

''ఎలా ఉన్నావు'' అని అడిగాడు. నా తలను పెద్ద తరంగం తాకింది. ''క్షమించు'' అని చెప్పి అతడు నా కంట్లోకి మరో తరంగాన్ని పంపాడు!

తాతయ్య తన యవ్వన జీవితంలో మంచి వైద్యుడుగా పేరుపొందాడు. అయితే పర్యావరణ సమస్యలపై స్వచ్ఛందసేనా సంస్థను ఏర్పర్చడానికి వైద్యవృత్తిని వదులుకున్నాడు. తన నిర్ణయంతో కుటుంబంలో చాలా మంది ఆశ్చర్యపడ్డారు. తన నిర్ణయం మార్చుకోవలసిందిగా వారు తనను కోరారు. అయితే తాతయ్య వెనుకడుగు వేయలేదు. మా నాన్న అప్పుడే కళాశాల చదువు పూర్తి చేసి ఉన్నత చదువుల కోసం విదేశాలకు వెళ్ళడానికి చూస్తుండేవాడు. అయితే డబ్బులేక అతడు ఉద్యోగం చూసుకోవలసి వచ్చింది. అందుకే అతడు తాతయ్యను ఇప్పటికీ క్షమించలేడు. ''ఈ సహజ సంభాషణ బాగానే ఉంది కాని దానివల్ల ఒరిగే మంచేమిటి?'' ఈ పునరావృత



కథను అతడు వల్లెవేస్తూ గొణుకున్నాడు. అలా ఎందుకు చేశారని నేను ఓసారి మా తాతయ్యను అడిగాను. తన పాపాలను కడిగేసుకోవడానికి తనకు ఇదొక మార్గమని అతడు చెప్పాడు. తన ముఖం పాలిపోవడంతో నేను ఈ విషయాన్ని మరికరెట్టించలేక పోయాను.

''మండలికి నువ్వు కూడా వస్తున్నావా?'' నేనడిగాను. ఆయన నాతో ఉంటే బాగుంటుందని అనుకున్నాను.

''నేనలా చేయలేను శివా, ఇక్కడ మానవులకు ప్రాతినిధ్యం వహించడానికి ఎంపికైన వ్యక్తివి నువ్వేనా అని నాకు భయంగా ఉంది! మనం తలదించుకునేలా చేయకు!'' అతడి గొంతులో పరిహాసం ధ్వనించింది.

''అలాగా? నాకు అదృష్టం కలగాలని ఆశీర్వదించడానికి ఇక్కడికి వచ్చావా?''

''లేదు'' అతడి గొంతులో తీవ్రత ధ్వనించింది.



| Night | రాత్రి | ರಾತ್ರಿ | Kannada | రాత్రి |
|---|---|---|---|---|

''మండలిలో ఈ రోజు నీ జీవితంపై గురిపెట్టబో తున్నట్లు జలమానవులు నాకు చెప్పారు.'' ఒక్కసారిగా నవనాడులూ కుంగిపోయినంత పనయింది నాకు. చరిత్ర పూర్వయుగపు కోరలు కలిగిన క్రూర జంతువుల సేనతో నేను ఎలా ఎదుర్కోవాలి? నా అంత్యక్రియల పాటను నేనే రాసుకోవలసి ఉంటుంది కాబోలు.

''వారికెలా తెలుసు'' నేను గొణిగాను.

''వారికి రాబిన్ చెప్పాడు. నువ్వు ఇక్కడ ఉంటున్న విషయం వెల్లడయ్యింది. నీకు సాయం చేస్తానని మయూరి నీకు వాగ్దానం చేసినప్పటికీ, ఇతర జంతువులు మాత్రం ఇప్పటికీ ఆగ్రహం తోటే ఉండవచ్చు.''

నేనేమీ చెప్పలేదు. నీళ్ళు ఉన్నట్లుండి భారంగానూ, ప్రాణాంతకంగాను కనిపించాయి.



నాకు నేనే నీటిలో కొట్టుకుపోతున్నట్లు భావించాను... కొట్టుకుపోయా... నాకు నేనే చెప్పుకున్నా... నా విషయంలో పొంచుకుని ఉన్న విధిని ఎదుర్కోవడం కంటే ఇదే మంచిది.

''గుర్తుంచుకో, నీ గురించి వారికేమీ తెలియదు. మనుషులకోసమే నువ్వు నిలబడుతున్నట్లు వారు చూస్తారు. వారి కోపాన్ని అర్థం చేసుకో.''

''అర్థం చేసుకున్న తర్వాత నేను చేయవలసింది ఏమిటి?'' వ్యంగ్యంగా అడిగాను. ఇలాంటి ప్రకటనలు చేయడం చాలా సులువే. కానీ నేను ఏం చేయాలి?

''ప్రారంభంలో నీ ఉద్రేకాన్ని కాస్త అదుపులో పెట్టుకో.'' తాతయ్య'' సూచించాడు. ఇంకా కొనసాగించాడు. ''నిన్ను చంపాలని వారు ప్రతిపాదించవచ్చు. దానికి తిరుగు సమాధానం ఇవ్వకు.''

''అలాగా? తర్వాత మరి? ప్రదర్శన తర్వాత అందరూ ఇంటికి వెళ్ళి టీవీ చూస్తారనుకుంటాను.'' రెచ్చిపోయాను. తాతయ్య ఏమాలోచిస్తున్నట్లు?!

''అవును, చాలా మంచి ఆలోచనే'' అతడు నవ్వటం కొనసాగించాడు. అతడికి మతి పోయిందా అని నేను ఆశ్చర్యపడ్డాను.

''నా బుర్ర ఇంకా పని చేస్తూనే ఉంది, భయపడకు.'' తాతయ్య నవ్వాడు. సాధారణంగానే అతడు నా మనస్సును చదవగలిగాడు. ''ప్రదర్శన, శివా అది ప్రదర్శన మాత్రమే. నిజమైనది కాదు.''

''హ్యా?''

''మయూరి నీ గురించి అందరికీ సర్ది చెబుతుంది. తమ కోపం చల్లార్చుకోవడానికి ఆమె ప్రతి ఒక్కరికీ అవకాశమిస్తుంది. భయపడకు,



Night రాత్రి ରାତ୍ରି Oriya రాత్రి

వారు శారీరకంగా నీకు హాని కలిగించరు. రక్తం చిందించడం మానవ చర్యగా ఇక్కడ వర్గీకరించారు.... వారు అలాంటి చర్యకు పాల్పడాలని కోరుకోరు.''



''ప్రదర్శన అంటే నువ్వు ఏమనుకుంటున్నావు?'' అడిగాను.

''అదంతా ఓ నటన. నీటిలో ముంచి వేయడం ద్వారా నిన్ను హతమార్చాలని వారు నీపై తీర్పు చెప్ప వచ్చు. చావడానికి సహజమైన మార్గం.''

''చావడానికి అది సహజమైన మార్గం ఎలా అవుతుంది?''

''ఎందుకంటే మనం నీటినుంచే వచ్చాము. నీటిలోనే మనం తప్పక చస్తాము''

''వాళ్ళు నిన్ను నీటిలోకి లాగేటప్పుడు నువ్వు చేసిన నేరాన్ని తప్పక అంగీకరించు. అప్పుడు వారు నిన్ను సముద్రంలో వదిలివేస్తారు...''

''అప్పుడు నువ్వు నన్ను కాపాడతావా?''

''కాపాడతాను. నేనిక్కడ ఉన్నట్లు నేలమీద ఉన్న ప్రాణులకు తెలీదు. జలమానవుల మద్దతు కూడా మనకుందని వారికి అస్సలు తెలీదు.''

''అదెలా జరుగుతుంది?''

''ఏమిటి?''

''జలమానవుల సహాయం. వారు మిత్ర జాతిగా కనిపించడం లేదు!'' వారి మధ్యే మేము ఉన్నామనే విషయం మర్చిపోయి అరిచాను.

''జలమానవులు దేనికి బాగా విలువ ఇస్తారో తెలుసా, శివా''

''తెలీదు.. చెప్పు మరి.''

''రహస్యాలు.''

''హ్హా?''

''ప్రపంచంలోని అన్ని రహస్యాలను వారు సేకరించారు. మానవుల నుండి, జంతువుల నుండి, పక్షుల నుండి సముద్రంలోకి వచ్చిన రహస్యాలు... ఎందుకంటే అంత్యదశలో ప్రతిదీ సముద్రం వద్దకే వస్తుంది మరి.''

''రహస్యాలతో... వారేం చేయబోతారు.''

''వాటిని భద్రపరుస్తారు.''

''అలా చేయడం వల్ల వారికి ఒరిగేదేమిటి?'' అర్థంకాక అడిగాను.

''వారికి సత్యం తెలుసు శివా. మానవులు కాలం వెనుకే పరుగెడుతున్నారన్నది నిజం. దాన్ని ఎప్పుడు చూస్తారో తెలియదు గానీ, మనల్ని దేవుడి నుండి వేరుచేస్తున్న అంతు చిక్కని విషయాన్ని శోధించడంలో వారు మునిగిపోయారు. సైన్స్, గణితం, సాహిత్యం, తత్వశాస్త్రం... ఇవన్నీ సత్యం కోసం జరుగుతున్న అన్వేషణలు కావా?''

నేను మౌనం వహించాను. ప్లాటో రూపాల సిద్ధాంతం గురించి నాకు గతంలో ఓమెన్ చెప్పిన విషయాలపైకి నా ఆలోచనలు మళ్ళాయి.

''తర్వాత?''

''తర్వాత వారు విశ్వానికి చెందిన కథలను



| Night | రాత్రి | રાત | Gujarati | రాత్ |
|---|---|---|---|---|

సురక్షితంగా భద్రపర్చారు. వారికి సంబంధిం చినంత వరకు తెలుసుకోవడం అన్నది సజీవంగా ఉంటుంది.''

నేను తలూపాను. ''వారికి నువ్వు ఏం చెప్పావు?''

''ఆ విషయం చెప్పలేకపోతున్నందుకు నేను భయపడుతున్నా... ఇంతవరకూ ఎవ్వరూ తెలుసుకోలేని లేదా ఇకపై తెలుసుకోలేని రహస్యం గురించి వారు నన్ను అడిగారు. వారికి నేను చెప్పేశాను.''

నా చూపులకు దొరక్కుండా తాతయ్య ముఖం తిప్పుకున్నాడు. సముద్ర మొక్క వైపు చూస్తున్నాడు. ఈ విషయాన్ని ఇంతటితో వదిలి వేయాలని నిర్ణయించుకున్నాను. ఇంతకు మించిన సంక్లిష్ట విషయాలు పొంచుకుని ఉన్నాయి.

''ఇది సరైన సమయం,'' ఉన్నట్లుండి నా మోచేతికి సమీపంగా పెద్ద శబ్దం వినిపించింది. ఒక్కసారిగా కలవరపడ్డాను. జలమానవుల నేత అక్కడ నిలబడి నాకేసి తీక్షణంగా చూస్తూ ఉన్నాడు.

''నువ్వు ఇప్పుడు వెళ్ళవలసి ఉంది శివా,'' తాతయ్య చెప్పాడు. ''మనం గర్వపడేలా చెయ్యి.''

మాటరాకపోవడంతో నేను ఊరికే తలూపాను. నేనింత వరకు నా పాఠశాలకు కూడా ప్రాతినిధ్యం వహించలేదు, అలాంటిది ఇక్కడ మానవజాతి మొత్తానికే ప్రాతినిధ్యం వహిస్తున్నాను!

నేను తొడుగును తీసివేసి, తాతయ్యకు అప్పగించాను. ఇద్దరు జలమానవులు నా రెండు చేతులను పట్టుకుని మెల్లగా ముందుకు తోశారు. నీటిగుంట ఉపరితలాన్ని శ్వాసించేముందు కాస్త ప్రశాంతంగా గడిపేందుకోసం నా కళ్ళను మరోసారి మూసుకున్నాను.

''మిత్రమా! నాలో భయం ప్రారంభమవుతోంది'' చీనా ఏనుగు నా చెవిలో గొణిగింది.

''ఏం జరుగుతుందో నువ్వు ఎప్పటికీ నమ్మలేవు'' పెద్ద గొంతుతో చెప్పాను.

''మీ తాతయ్య అంగీకరించాడా?'' స్వరంలో సానుభూతి ధ్వనిస్తుండగా అడిగింది.

''ఆ..! నీకెలా తెలుసు?''

''మండలికి వెళ్ళడానికి ముందుగా.... అతడిని కలుసుకుంటావని నీకు తెలుసు... నేను నీకు చెప్పలేదూ?''

''లేదు!'' గట్టిగా అరిచాను.

''సరేలే. ఆకస్మిక విషయాలు జీవితంలో సంతోషాన్ని కొనితెస్తాయి, కావా?'' చీనా ఏనుగు ఇకిలించింది. నేను తిప్పికొట్టాను... కోర నన్ను లాగినప్పుడు నేను దిగ్భ్రాంతి చెందాను.... అయితే తాతయ్య, లడ్డూ





**Night** రాత్రి ৰাতি **Assamese** రాతి

లను చూడటం మాత్రం కాస్త ఆశ్చర్యాన్ని కలిగించిన మాట వాస్తవం.

''ఒళ్ళు కాస్త వెచ్చబర్చుకో అబ్బాయీ,'' పొడవాటి ఆకులు కలిగిన చెట్టుకేసి చూపిస్తూ చీనా ఏనుగు చెప్పింది. నేనొక ఆకును తెంపి దాంతో నా శరీరాన్ని రుద్దుకున్నాను. తక్షణం నా దుస్తులు తడారిపోయాయి.



''మరో ఆశ్చర్యం!'' చీనా ఏనుగు నవ్వింది. నా కళ్ళను అటూ ఇటూ తిప్పాను. ''సిద్ధమేనా?'' ఏనుగు అడిగింది. నేను తలూపాను.

ఏనుగు నా ముందు నడుస్తుండగా నేను దాన్ని అనుసరించాను. పక్కపక్కనే మెల్లగా నడుస్తూ, మౌనంగా కవితాపాదాలను ఉచ్ఛరిస్తూ, పీలగా పాడుకుంటూ నడిచాను.

అనునిర్వను పగటిపూట చూడటం ఇదే మొదటిసారి. సౌందర్యం ఉట్టిపడుతున్న ప్రాంతం గుండా నన్ను తీసుకెళ్ళింది. అది పచ్చిగా, సంపద్వంతంగా ఉంది. నా ముక్కు పీలుస్తున్న పరిమళాలు కొత్తగానూ, ఉత్తేజకరంగానూ ఉన్నాయి. కీటకాల ధ్వనులను విన్నాను. అవి తేనెటీగలేనా? వాటి రొద ఒక మోతలాగా ఉంది. చుంబా.. వాంబా.. చుంపా.. వంపా.. నేను ఆ లయను అనుకరించడం మొదలెట్టాను.

''మౌనంగా ఉండు. ఉండలేవూ?'' చీనా ఏనుగు నవ్వింది. ''ఊహూ'' నడుము కదిలించడాన్ని ఆపివేయడం ఇష్టం లేనివాడిలా చెప్పాను.

''నిన్ను మండలిలో ప్రవేశపెట్టడానికి అది సంకేత ధ్వని'' కమ్మగా చెప్పింది.

నేను ఆగిపోయాను. నీ అంత్యక్రియల వద్ద నువ్వే నృత్యం చేయడం గురించి మాట్లాడుతున్నట్లుగా ఉంది.

''అప్పుడే వచ్చేశామా?'' ఆశ్చర్యపోయాను.

దాదాపుగా: ''అతడు చెప్పాడు. నువ్వు చూడాలనుకుంటున్నావా?''

''నేను తలూపాను.'' చీనా ఏనుగు కాస్త వంగి, ఉన్నట్లుండి తన తొండంతో నా శరీరాన్ని పెనవేసింది. ''ఏయ్'' గాభరాగా అరిచాను.

''ఊరకుండు'' అని చెప్పి ఏనుగు నన్ను ఓ పెద్ద చెట్టు కొమ్మమీద ఉంచింది.

''సూటిగా ముందుకు చూడు'' మృదువుగా చెప్పింది.

అసాధ్యమనిపించే రీతిలో సకల వర్ణ శోభిత సముద్రం నా కళ్ళ ముందు నిలిచింది. ఎటు చూసినా తలలు, తోకలు, కాళ్ళు, పళ్ళు, అంతంలోని క్రమరాహిత్యం. కళ్ళు... వేలాది జంతువుల కళ్ళు. సూర్యుడి వెలుతురులో మెరుస్తున్నాయి. వేచి చూస్తున్నాయి. పట్టి పట్టి చూస్తున్నాయి.

నా కోసం వేచి చూస్తున్నాయి.

– (ఇంకావుంది)

– సౌమ్యారాజేంద్రన్



| Night | రాత్రి | രാത്രി | Malayalam | రాత్రి |
|---|---|---|---|---|

# ఉదయ తారలు

## యశ్‌దీప్ అహ్లావట్

మీరట్‌కి చెందిన యశ్‌దీప్ అహ్లావట్ ఈ గుర్రపుస్వారీ పట్ల తన ఆసక్తిని మనతో పంచుకుంటున్నాడు. పదేళ్ళ వయసులోనే ఈక్వెస్ట్రియన్ క్రీడలో పాలు పంచుకున్నట్లు చెప్పాడు. తన తండ్రి, అర్జున అవార్డు గ్రహీత అయిన లెఫ్టినెంట్ కల్నల్ దీప్ అహ్లావట్ తనకు స్ఫూర్తిని కలిగిస్తుంటారట. ధైర్యసాహసాలు, కార్యాచరణ వంటి అన్ని గుణాలనూ ఈ క్రీడలో కనుగొన్నాడు. అత్యుత్సాహంతో ఈ క్రీడలో అడుగుపెట్టడానికి ఇవే కారణమయ్యాయట.

దేవన్ పబ్లిక్ స్కూల్‌కు చెందిన ఈ తొమ్మిదవ తరగతి విద్యార్థి రోజూ 90 నిమిషాల పాటు గుర్రపుస్వారీని అభ్యసిస్తుంటాడు. పరీక్షల సమయంలో మాత్రం మినహాయింపు ఉంటుంది. ఆట ప్రణాళికను రూపొందించుకోవడంలో తల్లి తనకు సహాయపడుతుందట, ఈ క్రీడలో సాధించిన విజయాల గురించి తను చదివే పాఠశాలలో ఓ కథనం ప్రచురించారు. అన్ని వైపుల నుండి లభిస్తున్న ఈ ప్రోత్సాహం యశ్‌దీప్‌కు ఆనందాన్ని కలిగిస్తూ ఉంటుందట.

డ్రెస్సేజ్, షో జంపింగ్ క్రీడలలో కూడా యశ్ పాలుపంచుకుంటూ ఉంటాడు. తను ఆడే ఆట నుంచి ఎన్నో జీవిత పాఠాలను నేర్చుకున్నాడు. క్లిష్ట సమయాలలో ప్రశాంతంగా ఉండటం, జీవితంలో మంచి చేయడానికే ఎల్లప్పుడూ ప్రయత్నించడం, సత్వర నిర్ణయాలు తీసుకోవడం, జంతువులపై ప్రేమను పెంచుకోవడం వంటివి తను నేర్చుకున్న పాఠాల్లో కొన్ని. ఈ గుర్రపుస్వారీ ఛాంపియన్‌కు చందమామ శుభాకాంక్షలు తెలుపుతోంది. తను చేసే అన్ని ప్రయత్నాలలో నెగ్గుకురావాలని ఆకాంక్షిస్తోంది.



గెలుపొందిన అవార్డులు:

- సాధించిన అంతర్జాతీయ పతకాలు: 2
- జాతీయ పతకాలు: 4
- సాధించిన ప్రాంతీయ పతకాలు: 27
- ఆస్ట్రేలియాలోని సిడ్నీ నగరంలో శిక్షణ మరియు పోటీల కోసం భారతీయ జట్టు (జూనియర్ విభాగం) ప్రతినిధిగా ఎంపిక.
- జూనియర్ జాతీయ ఈక్వెస్ట్రియన్ ఛాంపియన్‌షిప్ (2006-07) మరియు (2008-09)లో ఉత్తమ రైడర్‌గా ఎంపిక.
- ఢిల్లీ అశ్వ క్రీడా పోటీల్లో వరుసగా మూడుసార్లు: (2006-07), (2007-08), (2008-09)లలో ఉత్తమ రైడర్‌గా రికార్డు.



Night రాత్రి ᱧᱤᱫᱟ Santali నిండా

# చందమామ కబుర్లు

## నూతన కొమాడో డ్రాగన్ జననం




దాదాపు 34 ఏళ్ళ నిర్విరామ కృషి తర్వాత, కొమాడో డ్రాగన్‌కు జన్మ ఇవ్వడంలో సింగపూర్ జూ విజయం సాధించింది. 16 అంగుళాల పొడవుండే ఈ పిల్ల కొమాడో ప్రపంచంలో అతి పెద్ద బల్లి జాతులకు నిలయమైన ఇండోనేషియా వెలుపలి ఆసియా ప్రాంత జూలో జన్మించిన మొట్టమొదటి కొమాడో డ్రాగన్ అని జూ ప్రతినిధి చెప్పారు.

సహాయ డైరెక్టర్ విశ్వజిత్ గుహ ప్రకారం ''కొమాడో డ్రాగన్‌కు జన్మనివ్వడం ఈ జూ చరిత్రలో గొప్ప ఘటన. కొమాడో జంటల మధ్య పొందిక సరిగా లేకపోవడం, గుడ్డును పొదిగించడంలో అనుభవ లేమి, జూలో మగకొమాడోలే ఎక్కువగా ఉండటం వల్ల ఇక్కడ కొమాడోను పుట్టించే ప్రక్రియ సంక్లిష్టంగా మారింది.'' అంతరించి పోతున్న ప్రాణులకు సంబంధించి అంతర్జాతీయ ప్రకృతి పరిరక్షణ సమితి రెడ్ లిస్ట్‌లో కొమాడో డ్రాగన్లను 'ప్రమాదకర స్థితిలో ఉన్నవి'గా గుర్తించారు.

## మొసళ్ళతో బాలిక స్నేహం

రీటా అనే నాలుగేళ్ళ బాలిక పుట్టినప్పటి నుంచి మొసళ్ళతో వాటి బోనులోనే జీవిస్తోంది. ఆమె తల్లిదండ్రులు మార్గరీటా తరంటినా, సెర్గీ తారాంటినాలు ప్రాథమికంగా జంతు శిక్షకులు. రీటా పుట్టడానికి కాస్త ముందుగా మిషా, మాషా అనే రెండు మొసళ్ళను చేరదీశారు. వాటిని తమ బిడ్డతోటే పెంచాలని నిర్ణయించుకున్నారు. దాంట్లో వారు విజయం పొందారు కూడా!




పుట్టినప్పటి నుంచి రీటా, రెండు మొసళ్ళూ కలిసి ఉండటం చేత, ఆమెను తమ పంటికింద ముక్కలా అవి భావించలేదు. ఇప్పుడు వీళ్ళలో ఎవరూ ఏ ఒక్కరినీ విడిచి ఉండలేరు.

మొసళ్ళు క్రూర జంతువులే కానీ వాటికి కూడా విచక్షణ ఉంటుందని రీటా తండ్రి అంటారు. రీటా పసిపాప కాబట్టి తనకు ఏ హానీ చేయరాదని మొసళ్ళు అర్థం చేసుకున్నాయి. ఈ నాలుగేళ్ళలో అవి ఎన్నడూ ఆమెకు హాని చేయలేదు మరి.



Night రాత్రి रात्रिः Sanskrit రాత్రిః



# నవ్వుల పువ్వులు



టీచర్: నీ చేతి వ్రాత భయంకరంగా ఉంది రమణా. బాగా రాయడం నువ్వు నేర్చుకోవాలి మరి.

రమణ: నేను బాగా రాస్తే, నా అక్షరాలు భయంకరంగా ఉన్న విషయం బయటపడుతుంది కదండీ!

రాణి: నేను ఒకప్పుడు రోడ్డు మీద ఆడుకుంటూ ఉండగా, వేగంగా వస్తున్న కారు నన్ను బలంగా తాకింది. వెంటనే స్పృహ తప్పి పడిపోయాను.

వాణి: ఓ మై గాడ్! ఆ ప్రమాదం నుంచి బయట పడ్డావా లేదా చనిపోయావా?



రాణి: ఖచ్చితంగా నాకు గుర్తు లేదు. ఎందుకంటే అప్పుడు నా వయసు నాలుగేళ్ళే.



తాత: ఎందుకురా ఒక చేతికి మాత్రమే తొడుగు తొడుక్కుని ఉన్నావు.

రోషన్: ''ఎందుకంటే వాతావరణ శాఖ చెప్పింది. వాతావరణం చల్లగానూ ఉండవచ్చు, మరో వైపున వేడిగానూ ఉండవచ్చు!''

మనీష్: నాన్నా నాకో చిన్న సందేహం.

నాన్న: సందేహమా? అడుగు మరి!

మనీష్: ఇంకు ధర మరీ ఎక్కువా నాన్నా?



నాన్న: లేదు నాన్నా, ఎందుకలా అడుగుతున్నావు?

మనీష్: ఏంలేదు. కాసింత ఇంకు సోఫాపైన విదిల్చాను. అంతే అమ్మ ఒక్కసారిగా ఢీలాపడిపోయింది మరి!

## అల్లరి దత్తు











## హాస్యకథ

# దర్జీ మేలువస్త్రం

ఓసారి అక్బర్ ఆస్థానానికి అతి సుందరంగా రూపొందించబడిన పెట్టె ఒకటి చైనా నుండి బహుమతిగా వచ్చింది. దర్బారులో ఉన్న వారు మునుపెన్నడూ చూడనంత నాణ్యమైన, అతి మృదువైన పట్టుతో తయారు చేసిన మేలివస్త్రం ఆ పెట్టెలో ఉంది. అక్బర్ సతీమణి దాన్ని చూసి ముచ్చటపడింది. నగరంలో బాగా పేరున్న దర్జీకి ఇచ్చి దాంతో చక్కటి బట్టను కుట్టించుకోవాలని బేగం నిర్ణయించుకుంది. ఆమె ఆ మేలి వస్త్రాన్ని బీర్బల్‌కు చూపించింది. ఆ పట్టు మృదుత్వాన్ని చూసి బీర్బల్ ప్రశంసించాడు. ''మా ప్రియమైన బేగంగారికి సరిగ్గా సరిపోయే మేలివస్త్రం ఇది'' అని చెప్పాడు.

''బీర్బల్, మనం కుట్టడానికి పంపించే ప్రతి గుడ్డ ముక్కలోనూ కొంత భాగాన్ని దర్జీలు కొట్టేస్తారని విన్నాము. నిజమేనా?'' బేగం అడిగింది. ''అవును బేగం సాహెబా!'' చెప్పాడు బీర్బల్.

''అయితే నేను పంపిన మేలివస్త్రం నుంచి తయారైన దుస్తులను మరెవరూ ధరించకూడదని అనుకుంటున్నా'' బేగం చెప్పింది.

''అలా కుదరకపోవచ్చు. ఏదేమైనప్పటికీ మీ మేలివస్త్రం నుంచి కొంత భాగాన్ని దర్జీ ఖచ్చితంగా తీసేసుకుంటాడు.'' బీర్బల్ చెప్పాడు.

బేగం తల అడ్డంగా ఊపింది. ''అంత ఖచ్చితంగా ఎలా చెప్పగలవు బీర్బల్? నా కోసం బట్ట కుట్టుతున్నప్పుడు దర్జీ పక్కన భటులను కాపలా పెడితే ఎలా ఉంటుంది?'' అన్నది.

బీర్బల్ చిరునవ్వు నవ్వాడు. ''బేగం సాహెబా, అలాగే కానివ్వండి. అయితే మీరెన్ని ప్రయత్నాలు చేసినా, మీ మేలివస్త్రంలో కొంత భాగాన్ని కొట్టేయడానికి దర్జీ తప్పక మార్గం కనిపెట్టితీరతాడు'' అన్నాడు.

బేగం తల అడ్డంగా ఊపింది. ''రాజ దర్జీని పిలిపించండి. అంతఃపురంలోనే బట్టలు కుట్టమని అతడికి చెప్పండి. అతడి చుట్టూ భటులను కాపలాగా ఉంచండి'' ఆదేశించింది.

''వెంటనే ఆ ఏర్పాట్లు చేయిస్తాను బేగం సాహెబా'' చెప్పాడు బీర్బల్.

ఆ మరుసటి దినం, రాజ దర్జీని అంతఃపురంలోకి తీసుకువచ్చారు. బేగం అతడికి





అన్ని షరతులూ వివరించింది. తర్వాత నలుగురు సైనికులు అతడిని ఓ గదిలోకి తీసుకుపోయారు. గది నాలుగు మూలల్లో నిలబడి అతడిపై ఓ కన్నేసి ఉంచారు. అతడు అక్కడే అన్నపానీయాలు తీసుకునేలా చేశారు. కుట్టడం ముగించిన తరవాత అతడు ఆ గదిలోనే నిద్రపోయేవాడు. గది బయటకు రావడానికి, ఒంటరిగా ఇంటికి వెళ్ళడానికి కూడా దర్జీని అనుమతించలేదు!

అలా ఓ వారం గడిచింది. దర్జీ చేతుల్లో ముఖ్యమైన పని ఉండటం చేత అతడు సహనంతో పనిచేశాడు. బేగం సాహెబా దుస్తులు చాలా బాగా కుదిరాయి! ఓ రోజు ఓ చిన్న అమ్మాయి అంతఃపురానికి వచ్చింది. ఆమె దర్జీ కూతురు. ఆమె విషాదంగా కనిపించింది. తన తండ్రిని చూడాలని ఆమె కోరిక.



తన తండ్రి బట్టలు కుడుతున్న గది ప్రవేశ ద్వారం వద్దకు అమ్మాయి చేరుకుంది. తండ్రిని చూడగానే పట్టరాని సంతోషంతో అతడి వద్దకు పరుగెత్తాలని చూసింది. అయితే భటులు ఆమెను అడ్డుకున్నారు.

''లోపలకు పోవడానికి ఎవరికి ప్రవేశం లేదు.'' చెప్పారు. ''మా అమ్మ వద్దనుండి ముఖ్యమైన సమాచారం తీసుకుని ఇక్కడికి వచ్చాను.'' చెప్పిందా అమ్మాయి.

''ఎంత ముఖ్యమైనదైనా సరే, నీవు నిలబడ్డచోటి నుంచే ఆ విషయాన్ని చెప్పు'' వారిలో ఒక భటుడు చెప్పాడు.

''నాయనా, నీకు దూరమైపోయాము. త్వరగా ఇంటికిరా, ఇప్పుడే పోదాం పద!'' అమ్మాయి ప్రాధేయపడింది.

''లేదమ్మా! నీతో రావడం కుదరదు.'' అని చెప్పి అందుకు కారణం వివరించాడు. అయితే ఇంటికి రావాలని అమ్మాయి పదేపదే అతడిని బలవంతపెట్టింది.

రోజుల తరబడి ఆ గదిలోనే కూర్చుని ఉండటంతో అతడికి పరమ చికాకుగా ఉంది. అతడి కళ్ళు ఎర్రబడి, ఆగ్రహంతో కనిపించాడు.

''వెళ్ళిపో, పని పూర్తయిన తరవాతే ఇంటికి వస్తానని అమ్మకు చెప్పు.'' దర్జీ ఆగ్రహంతో కసిరాడు.

''నాయనా, నాతో రా'' ఆ అమ్మాయి ప్రాధేయపడింది.

దర్జీ దీంతో మండిపడ్డాడు. ''మతిలేని దానా, చెప్పిన విషయాన్నే ఎన్నిసార్లు వల్లె వేస్తావు నువ్వు'' ముఖం కందగడ్డలా పెట్టుకుని అరిచాడు.



తండ్రి అలా గావుకేకలు వేయడం కూతురుకు తమాషాగా అనిపించింది. ఆమె ఒక్కసారిగా నవ్వేసింది.

దర్జీ ఉగ్రుడయ్యాడు. తన చెప్పును తీసుకుని ద్వారంలోంచి బయటకు విసిరి వేశాడు. ఆ అమ్మాయి మళ్ళీ పకపకా నవ్వుతూ, ఆ చెప్పును తీసుకుని పరుగెత్తింది. దర్జీ చికాకుగా తలను విదిలించాడు. ''ఈ కాలం పిల్లలు బొత్తిగా చెప్పింది వినరు,'' అతడిలా గొణుక్కుంటూ మళ్ళీ పనిలో మునిగిపోయాడు.

రెండు వారాలు తీవ్రంగా శ్రమించిన తరవాత బేగం దుస్తులు సిద్ధమయ్యాయి. ఈ పనికి గాను అతడు వెచ్చించిన ప్రతి క్షణమూ విలువైనదే మరి. ఎందుకంటే, ఆ దర్జీ ఇంత సుందరమైన దుస్తులను గతంలో ఎన్నడూ కుట్టి ఎరగడు. పొందికగా కుదిరిన తన కొత్త దుస్తులను చూసి బేగం సంతోషం పట్టలేక పోయింది. దర్జీని ఘనంగా సత్కరించింది. ఆ సుందరమైన పట్టు వస్త్రం నుంచి అంత చక్కటి దుస్తులను కలిగి ఉన్న ఏకైక వ్యక్తి తానే అయినందుకు చాలా సంతోషించింది. విజయ గర్వంతో ఆమె బీర్బల్ కేసి చూసింది.

ఒక రోజు, బేగం నగరం సందర్శనకు బయలుదేరింది. ఒక్కసారిగా ఆమెకు దిగ్భ్రాంతి కలిగింది. ఆమె ధరించిన కంచుకమును పోలిన దుస్తులను మరొక మహిళ ధరించి ఉంది. బేగం తన కళ్ళను తానే నమ్మలేకపోయింది. ఆ మహిళను వెంటనే పట్టి తెమ్మని ఆమె భటులను ఆదేశించింది. తరవాత ఆ దుస్తులు తనకు ఎక్కడినుంచి వచ్చాయో చెప్పమని నిలదీసింది. వణికి పోయిన ఆ మహిళ, దర్జీ వాడైన తన భర్త ఆ రవికను తనకోసం కుట్టించి ఇచ్చాడని సమాధానమిచ్చింది.

బేగం ఆశ్చర్యంతో తలమునకలైంది. దర్జీ చుట్టూ భటులను కాపలా పెట్టినప్పటికీ అతడు తన మేలివస్త్రాన్ని దొంగిలించగలిగాడు. ఆమె బీర్బల్‌ని పిలిపించి మాట్లాడుతూ ఆ దర్జీని పట్టితెమ్మని కోరింది. మళ్ళీ మందిరానికి వచ్చిన దర్జీ వణికిపోయాడు.

''భయపడకు, భటులు కాపలా కాస్తున్నప్పటికీ నా వస్త్రాన్ని నువ్వు ఎలా బయటకు తరలించావో చెబితే నిన్ను క్షమిస్తాను.'' బేగం ఆసక్తిగా అడిగింది.

''బేగం సాహెబా! గది నుంచి చెప్పును బయటకు విసిరినప్పుడు మేలివస్త్రం లోంచి ఓ ముక్కను దానిలో ఉంచాను. దీనికి నేను ముందుగానే పథకం వేశాను. నేను చెప్పినట్లే నా కూతురు ఆ చెప్పును ఇంటికి పట్టుకు పోయింది.'' అని దర్జీ చెప్పాడు. ఆసక్తిగా వింటున్న బేగం దీంతో పక్కున నవ్వేసింది.

''యథాప్రకారంగా నీవు చెప్పిందే నిజమైంది బీర్బల్'' బేగం వ్యాఖ్యానించింది.



Welcome స్వాగతం स्वागत Marathi స్వాగత్



# పొదుపు

కామరాజు డబ్బు దుబారా మనిషి. అతడికి హఠాత్తుగా పొదుపు చేయాలన్న ఆలోచన కలిగి, మిత్రుడు రంగనాథాన్ని సలహా అడిగాడు. రంగనాథం అతడికి మట్టితో చేసిన ఒక హుండీ ఇచ్చి, ఇక ఆ పొదుపేదో ప్రారంభించమన్నాడు.

కామరాజు హుండీలో కొంత డబ్బు వేసి, వారం తిరిగేసరికి, ఏదో అవసరం కోసం, దాన్ని పగలగొట్టి డబ్బు వాడుకున్నాడు. ఈ సంగతి విన్న రంగనాథం అతడికి ఇనుముతో చేసిన హుండీ ఇచ్చి, దాని తాళపు చెవిని, కామరాజు ఇంటి ముందున్న పొదల్లోకి విసిరివేశాడు. మళ్ళీ వారం రోజుల పాటు కామరాజుకు డబ్బు అవసరం రాలేదు.

అయితే, వారం రోజులు గడిచాక రంగనాథం, కామరాజు ఇంటికేసి వచ్చినప్పుడు, అతడు పొదల్లో దేనికోసమో వెదుకుతూండడం కనిపించింది. సంగతేమని రంగనాథం అడగగా, డబ్బు అవసరం వచ్చిందనీ, రెండు రోజులుగా హుండీతాళపు చెవి కోసం వెతుకుతున్నాననీ, కామరాజు చెప్పాడు.

అందుకు రంగనాథం నవ్వి, ''ఈ రెండు రోజుల్లో, ఆ డబ్బు అవసరం తీరే ఉంటుంది. నీలో ఉన్న పెద్ద లోపం ఏమంటే, కొద్దిపాటి అవసరం కలిగినా, దాచిన డబ్బు తీసి ఖర్చు పెట్టేస్తూంటావు. ఈ పొదల్లో, నీకా చిన్న తాళపుచెవి ఎలానూ కనిపించదు. ఇక శ్రమపడకు,'' అని సలహా ఇచ్చాడు.

కామరాజు అవునన్నట్టు నిట్టూర్చి, ''ఎలాగైతేనేం, నన్ను పొదుపరిని చేశావు,'' అన్నాడు.

–దాసరి వెంకటరమణ





Log onto www.chandamama.com

# Your Chandamama is available in many avatars!




**Regional Chandamama**
(9+ age group):
Read your favourite stories in your own language! Chandamama takes you closer home even as your imagination soars!

## Your Language, Your Chandamama.

* Ramayana
* Vikram-Vetal
* Panchatantra
* Arya

Available in 12 Languages:
Telugu, Hindi, Marathi, Oriya, Kannada, Bengali, Tamil, Malayalam, Gujarati, Assamese, Sanskrit, Santali




**Chandamama English**
(9+ age group):
A children's magazine that has adapted itself to the changing needs of children across decades. Chandamama English offers you a delectable mix of the classic and the contemporary in 72 pages that value fun!

* Sports * Technology * Contemporary stories * Classics

Revamped. Redesigned. Relevant. Read it!




**Junior Chandamama**
(4+ age group):
A magazine for the little ones peppered with activities, pictures, and stories that will grip their imagination.

Make friends with **Mintoo**, **Gooba**, and a host of other whacky characters!

* Picture story
* Puzzles & Crosswords
* Colouring
* Rebus

You name it and it's got it!

CHANDAMAMA (Telugu) February 2010 Registrar of Newspapers of India No.1114/57. Regd No. TN/CH(C)/216/09-11
Licensed to post WPP - Inland No.TN/CC(S)Dn/84/09-11, Foreign No. 85/09-11



# బుబ్బా జట్టు సాహసాలు




నలుగురు యువతీయువకులు ఓ తోటలో విహారానికి వచ్చారు.

పిక్‌నిక్‌కు ఇదో చక్కటి దినం. మీకు అంగీకారమే కదూ?

తప్పకుండా.

హేయ్, అక్కడున్న ఆ పొడవాటి యువకులు ఎవరు? వాళ్ళెందుకు మనకేసి కళ్ళప్పగించి చూస్తున్నారు?

వీళ్ళు అటుకేసి చూశారు, ముగ్గురు యువకులు తమవద్దకు వస్తుండటం చూశారు.

మీరు మా చోటులో ఉన్నారు.

ముందు మేమే వచ్చాం మరి. ఈ తోట చాలా పెద్దది, దీంట్లో ఏదో ఒక చోటును మీరు ఎంచుకోవచ్చు కదా?

మేం చెప్పేది మీకు వినబడటం లేదా? ఇది మా చోటు.

మరో చోటుకు పోరా నాయనా?

ఆ పొడవాటి యువకులలో ఒకరు కాలు అడ్డంగా చాపి, నడుస్తున్న జోను పడగొట్టాడు. జో బొక్కబోర్లా పడ్డాడు.

జో రహస్యంగా ఓ బుబ్బాలూ బ్లూబెర్రీని నోట్లో వేసుకున్నాడు.

అయ్యో, నాయనో, వామ్మో, వాప్పో...

హేయ్, నువ్వేం చేశావో చూడు. అతడు గాయపడ్డాడు! మనం అంబ్యులెన్స్‌ను, పోలీసులను పిలవాల్సి ఉంది.

ఇది పోలీస్ కేసే అవుతుంది. నువ్వు మా స్నేహితుడిని గాయపర్చావు.

పోలీస్?!

క్షమించాలి. పిల్లలూ... మిమ్మల్ని ఊరికే ఆటపట్టించామంతే... దయచేసి పోలీసులను పిలవద్దు.

ఉన్నట్లుండి, జో ఎగిరి దుమికి, భీతిగొలిపే కళ్ళతో వారికేసి చూస్తూ తన నీలి నాలుకను చాచాడు.

ఓహ్... వద్దు!

అహ్హాహ్హాహ్హాహ్హో...

Bubbaloo

ఇప్పుడు మీ నాలికకు బుబ్బాలూ బ్లూబెర్రీతో రంగులద్దండి. మీ స్నేహితులను ఆటాడించండి!